అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారిచే
ప్రకటితము : రాజమహేంద్రవరము

1934—3

దీని వెల

౦—౧౨—౦

# యమునాబాయి



శ్రీ క్రొపవరపు నరసింహము



సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

# పీఠిక



ఈ గ్రంథము శ్రీ జోగేంద్రనాథ చట్టోపాధ్యాయుని 'బటదిదీ' నామక బెంగాలీకథ నాధారముగ గైకొని శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్రగారిచే మహారాష్ట్ర భాషయందు 'గరీబ్ బిచారీ యమున' యను పేరున రచింపబడినది. అద్దానిని 'యమునాబాయి' యనుపేర నేనాంధ్రీకరణ మొనర్చితిని.

తమతమ పరిస్థితుల బరిశీల్పింపని ప్రేమాంధులగు యువతీయువకుల కీగ్రంథ మత్యంతబోధ ప్రదమును, మార్గదర్శకమునునై యున్నది. అటులనే కేవలము తమ కుల గౌరవమునకు గళంకము ఘటిల్లుననియు, తమ యైశ్వర్యాడంబరములకపయశ స్సావహిల్లకుండ గాపాడవలయుననియు దలంచి ప్రౌఢవధూవరుల యీప్సితములును, వారి యిష్టాయిష్టములను మన్నింపక వధువునుగాని, వరునిగాని జీవితపర్యంతము బద్ధమై యుండు వివాహబంధమున ముడిబెట్టి తమ మాతృపితృాధికారమును నిర్వహించుకొను మాతాపితరులకు గూడ నీగ్రంథమువలన నేర్చుకొనదగిన విషయములు కొన్ని గన్పట్టును.

అవ్యాజమును, అనుపమానమును, దివ్యమును, పవిత్రమును నగు యమునా గంగాధరుల పరస్పరానురాగము వర్ణ

నాతీతము. గంగాధరుని యపూర్వశ్రమసహిష్ణుతయు, ఉజ్వల కర్తవ్యనిష్టయు, ప్రత్యక్షనిరాశా సందర్భములయందు గూడ నాతనికి గల కార్యోత్సాహమును, పట్టుదలయు నిరుపమానములు. భగీరథీబాయి దయాస్వభావ మద్వితీయమని యీ గ్రంథము పఠించినవారికే బోధపడగలదు కావున నీగ్రంథము యొక్క ప్రాశస్త్యము నేనంతగ వ్రాయబనిలేదు.

ఈగ్రంథమును తమ సరస్వతీ గ్రంథమండలియందు ప్రకటింప ననుమతించిన శ్రీ శ్రీఅద్దేపల్లి లక్ష్మణస్వామి నాయడుగారికి నే నెంతయు కృతజ్ఞుడను.

బందరు
ది 1-12-25 } క్రొవ్వవరపు నరసింహాము.

ఓ వెఱ్ఱిమానసమా ! నీశక్తి నతిక్రమించి నీవెంతటిమహోన్నత స్థానమునకు ఒరుగులిడుచుంటివి ? నేనీప్రపంచమునం దొకా నొక క్షుద్రమానవుడను. మఱి యమరవాంఛితసుధాపానాభిలాషనీకెందులకు ? నేను దురదృష్టబధిరుడను. మఱి యీసంగీత శ్రవణలాలస నీకేటికి ? నేను పంగుసు. మఱి మహోన్నత పర్వత శిఖరాధిరోహణకాంక్ష నీకేమి ప్రయోజనము ? నేను మూకను. మఱి యలౌకికచాతుర్యమువలన నెల్లరమోహితుల జేయ నీవెందులకు బ్రయత్నించెదవు ? నేను వామనుడను. మఱి చంద్రగ్రాహాభిలాష నీకేమి యుపయోగము ? సారాసారవిచార విముఖత నీకేటికి ? పరాన్నోపజీవిత మొనర్చు నేనొక యనాధతరుణుడను. పాపముసాధుశీలుడగునానారావు గారి కేవల కృపాప్రసాదమువలననే నాజీవితము నడచుచున్నది. ఈవిస్తీర్ణప్రపంచమునందు నావారని చెప్పుకొనుట కెవ్వరునులేరు. అతిబాల్యకాలముననే నాజననీజనకులు నన్నితరుల స్వాధీనమొనర్చి తాము పరలోక గమన మొనర్చిరే ! నాతండ్రి నానారావుజనకునికడ దివాణగిరీ యుద్యోగమున నుండెడి వాడు. ఆతడు యజమానునియెడ వినయవిధేయతలు గలిగి, మిగుల విశ్వాసముతో సేవయొనర్చు వాడైనందుననే నానారావు నన్నీ యనాధస్థితియందు జేరదీసెను. ఇంతియే కాదు. తనస్వజనులలో నన్నొకనిగ భావించి నన్నతిప్రేమం

బున బ్రతిపాలనమొనర్చు చుండెను. నాశిక్షణ విషయమున గూడ నాతడణుమాత్రమును నిర్లక్ష్యమును జూపినవాడుకాడు. నానారావు కుటుంబమున నౌకరు చాకరు లనేకులు గలరు. అతడు నన్ను గూడ నొక స్వల్పకార్యమునకు నియమించియుం డెను. ఆతని యేకమాత్రప్రియ సోదరీమణియగు యమునా బాయికి విద్యాభ్యాసమొనర్చు కార్య భార మాతడు నాపై నునిచెను. కాని యిందుకు నేనేల యియ్యకొంటిని? సరే. యియ్యకొంటిని. కాని నాస్థితిమరచి నేనేటికి ప్రేమాంధుడ నైతిని? కాని యీ జగతీవలయమున ప్రేమ విషయికవస్తువు నందెవ్వడు మోహితుడుగాకుండును? అయినను ప్రేమించుటకు నాకేమియధికారము గలదు? నాకేమి పాత్రతగలదు?—కాని మదీయ మానసాంతర్గతదుస్సహవేదన నిట బ్రకటన మొనర్చి వాచకమహాశయుల కోమలాంతఃకరణములవ్యథిత మొనర్చుటకన్న వారికి బ్రారంభమునుండియు నా చరిత్రము విదిత మొనర్ప బ్రారంభించుటయే యుత్తమము.

నాజనకుడు నానారావు గృహమున విశ్వాసయోగ్యుడగు గుమాస్తాయై యున్నందున నేనునిరాధారుడనై నంత నేయాతడు నాకాశ్రయ మొసగి తనగృహమున జేర్చుకొని నన్నాదరించెను. నానారావు నన్ను నిజసోదరునిగ భావించి ప్రేమించుచుండెను. ఆతని వయసిప్పటికి ముప్పది వత్సరములు మీరియుండును. ఆతని భార్యయు, నవివాహితయగు నొక సోదరియు మాత్రమె ప్రస్తుతమాతని కుటుంబమునగలస్వజనము. నానా

రావున కింతవర కపత్యలాభ మేమియు ప్రాప్తము కాలేదు. ఇతర యీనాందారుల పుత్రులవలె నానారావు వ్యసనియు, అక్షరశత్రువునై యుండక బొంబాయి యూనివర్సిటీయొక్క యత్యున్నతపదవి నందియుండెను. ఆతని ప్రవర్తనాదులవలన మనకాతడు ప్రస్తుతకాలసనాతన ధర్మములయెడ మిగుల నభిమానముగలవాడని తోచును. అయినప్పటికిని గృహమునం దాతని యాచరణమాత్ర మవ్విధమున గన్పట్టదు. మన సమాజమునం దారూఢములై యున్న బాల్యవివాహము, స్త్రీశిక్షణ విషయమున నుపేక్ష, విధవాకేశవపనము నిత్యాదిదోషముల కజస్రమాతని మనస్సు వ్యాకులము జెందుచుండును. స్త్రీల కుచ్చశిక్షణము, మరియు స్వాతంత్ర్యమునొసగుటయాతనియభిమతము. నాకుగూడ చిన్ననాటనుండియు నవీనసాంఘికాచారముల యందే ప్రవృత్తికలిగియుండుటవలన మాకుభయులకు నిందు విషయమున ననిశము వాదవివాదములు పొసగుచుండెడివి. నానారావుమతవ్యామోహముననవీనసాంప్రదాయముల వంక నిసుమంత ప్రసరించినది సత్యమే. అటులయ్యు నాతడు స్త్రీ పునర్వివాహవిషయమున మిగుల బ్రతికూలుడై యుండెను. ఈ సందర్భమున నప్పుడప్పుడు మే మొందురులము తర్కవితర్కము లొనర్చుచుండెడివారము. అట్టియెడ నేనీవిషయమున నానారావునకు సప్రమాణికముగ నచ్చబలికి యాతని నిరుత్తరునిగ జేయుచుండెడివాడను. అయినను నాతడెన్నడును నీ విషయమున దన యంగీకారమును గనబరచియుండలేదు.

నానారావుని యర్ధాంగి భగీరథీబాయి. ఈమె నిశ్చయముగ పవిత్రభగీరథి మాడ్కి నిర్మలాంతఃకరణయై యుండెను. ఆమె గుణగణములు, మరియునామెలావణ్యము వీని శ్రేష్ఠత్వమొక్కెడ నేరీతిని సంఘటించెనో యిదియొక మహాప్రశ్నయైయున్నయది. యౌవనావస్థయందలి యామె యాయనుపమ సౌందర్యమునకు గాను నేనామె నేమాత్రము ప్రశంసజేయబోను. కారణ మేమన? రూపముయొక్కస్థిరత్వ మెన్నిదినములు? విధాతయాసాధ్వికి నామె మనోహర సౌందర్యశోభవృద్ధింగత మొనర్చుకొనుట కనేక దివ్యగుణములు గూడనొసగియుండెను. నేను నిజముగ వచింపుచుంటిని. అవ్విధమగు రూపగుణములు—రూపగుణములే యేమి, వానితో బాటింకను విపులైశ్వర్యము, ఒక్క ప్రదేశమున సమ్మేళనమై యుండుట నే నవలోకించినది యీ యొక్కచోట మాత్రమే; ఆమె గుణసౌందర్యాదు లేమని వర్ణింతును! ఆమె మానసము కరుణారసపూరితము. ఆమె యనాధుల పాలిటికల్పలత. ఆనవనీతహృదయచే మేలుపడయని వారాయూరలేరు. ఆమె యెల్లరకు దయాస్వరూపయే. ఆమెకుగల ధర్మనిష్ఠ, పాతివ్రత్యము, నాకెందునను దృగ్గోచరము కాలేదు. భగీరథివంటి పరదుఃఖములకు దుఃఖితయగు దయాశాలిని యెచ్చటనో యరుదుగ గన్పట్టును. ఆమెసదా యానందిని. సదావినోదిని—దుఃఖము, చింత, ఇత్యాది చిహ్నములుసైత మామె సతతమందహాసవదనారవిందముపై గన్పట్టవు.

కాని యింతటి సద్గుణవతియై యుండియు నేమి ప్రయోజనము? ఆమెయశిక్షితయైయుండెను. పాప మామెకు మూలాక్షరపరిచయము గూడలేదు. మఱియునందులకై యప్పుడప్పుడు మానానారావుగారు మిగులదుఃఖితు డగుచుండెడివాడు. అయినప్పటికిని మాభగీరథీబాయిసన్నిధి కేతెంచినతోడనే యాతని యాదుఃఖమంతయు నెక్కడి దక్కడ మటుమాయమై పోవుచుండును. భగీరథీబాయి యొక్క యావిశాలహృదయమునందు పొంగిపొరలుచున్న యానంద ప్రేమ ప్రవాహము నందాతడు మునిగి తేలుచుండును.

భగీరథీబాయి యొక్క ధర్మాసక్తిమాత్ర మపూర్వమైయున్నది. ప్రతి ధార్మికవిషయమును నామె తదేక నిష్ఠతో నిర్వర్తించుచుండును. భగీరథీబాయి శిక్షితమాత్రముగాదు. అటులయ్యు నామెవంటి కుశాగ్రబుద్ధిగల స్త్రీని నే నింతవరకెచ్చటను గాంచియుండలేదు.

ఈసందర్భమున యమునాబాయి విషయమించుక యుల్లేఖన మొనర్పవలదా! భాషామధ్యమున నందు కనువగు శబ్దజాలములేదు. అటులే లేఖనాసామర్థ్యమునందుగూడ నేనంతకుశలుఁడను గాను. మరి నే నామె నెటుల వర్ణనమొనర్పగలను? ఆమె నా స్మరణకు వచ్చిన మాత్రముననే మదీయహృదయము కంపితమై యొక్కటే విధమున దటతట గొట్టుకొనుచుండును. మరి నే నామె నెట్లువర్ణింపగలను? ఆయోచన నా మనమున స్ఫురింపగనే మదీ యాంతఃకరణము విలక్షణమై

కలవెలపాటు నొందును. మరి యద్దానిని నే నెటుల వ్యక్త పరుపగలను? నేను మూఢుడను. నా కామె స్వరూపవర్ణన మొనర్ప సాధ్యముకాదు. యమునాబాయికి బోల్పదగు వస్తుసముదాయ మీ ప్రపంచమున నొక్కటిగూడ లేదే! రూపము, మరియు గుణము నివిగాక నామె కడ నేమో విశేషమున్నది. కారణ మేమన? ఈ జగత్తునం దెన్నియో సుందరరూపముల నీ చక్షువులతో నే మాటి మాటికి గాంచి యుంటిని. సుశీలురగు ననేక మనుజుల పరిచయము నాకు గలిగియుండెను. కాని యమునాబాయి కడగల మోహకశక్తి యెవరియందును నణుమాత్రమునుగూడ లేదే! భాగీరథీ బాయిని యిహలోకదేవి యని తలంచి నేను నిత్యము బూజ యొనర్పుచుండుట నిశ్చయము. కాని యమున నా యిష్ట దేవత.

పాపము యమునకుగూడ నా వలె బాల్యమునందే తల్లిదండ్రులు గతులైరి. అయినను వదినెయు సోదరుడును నామె కెన్నడును మాతాపితరుల జ్ఞాపకమైనను గలుగనీయరైరి. భాగీరథియే యామెకు జననియు, వదినెయు మరియు మైత్రిణి యునై యతిప్రేమంబున, నతిగారాబమున నామెను జూచు చుండును. నానారావు తనకీమె యేకమాత్రసోదరియై యుండ నిక జెప్పవలసిన దేమి? ఆతడు తన యనుంగు చెలియలి కెల్ల ప్పుడు సంతసము గూర్చుటయందే ననిశము నతిశయప్రయత్న మొనర్చుచుండును. యమున యతని యాటవప్రాణము.

యమునకొంటకాత ఁడొనర్చు కార్యముల కవధిలేదు. మరియు యమున కూడ నిజముగ నందునకు బాత్రతగల యోగ్యురాలు. ఆమె ప్రకృతి యింతటి కోమలము, యింతటి మాధుర్యము—ఛీ! ఆమె కెటులుపమాన మొసగగలను! ఈపృథ్వీతలమున నట్టికోమలము, అట్టి మాధుర్యమునగు పదార్థము నాకు మరెచ్చటను నొక్కటిగూడ గన్పట్టలేదు—నిశ్చయముగ గానవచ్చుటలేదే! ప్రపంచమున నే వస్తువుయొక్క కోమలత్వమును, మరియు మాధుర్యమును నా కోమలమాధురీయమునకు దుల్యమెటుల చేయగలను?

యమున యిప్పుడు నాతో బూర్వమువలె నసంకోచవృత్తిని నేమియు సంభాషింప సాహసించుటలేదు. అయినను నామెయొక్క యుజ్జ్వలవిశాలనేత్రయుగ్మ ముచ్చస్వరమున నొక నూతన భాషామధ్యమున నాతో సర్వదా నెన్నిమారులో సంభాషణ మొనర్చుచుండెను. పూర్వమువలె నన్నిప్పుడు 'అన్నా' యని యందరి యెదుటను బిలచుటకు సాహసించుటలేదు—ఆమె లజ్జితయగుచుండెను. అటులయ్యు ననుక్షణము నామె నన్ను బిలచుచున్నటులే నా మానసమున దోచుచుండును. ఆమె యిప్పు డెప్పటివలె నా కడకు వచ్చుటకు సిగ్గిలుచుండెను. అటులయ్యు నామె సర్వదా నా సన్నిధి నున్నటులే నేను గన్నులు మూసికొనినను గన్పట్టుచుండును. ఇప్పుడు నా కడ విద్యాభ్యాస మొనర్చు పట్టున నామె యొక విధమగు తొట్రుబాటు నొందుచుండును. పుస్తకమునందలి

పాతములవై పున కామెలత్న్యమే మాత్రమును ప్రసరించుట లేదు. పూర్వమామె కొక్కమారు బోధించిన జాలును. వెటనే గ్రహించెడిది. ఇప్పు డన్ననో శతసహస్రపర్యాయముల గఱపినను నామెకు బోధపడుటలేదే! ఆమెకిట్టి యవస్థప్రాప్తించిన దేలకో? ఆమె నన్ను బ్రేమించుచున్నదా యేమి నిజముగ యమున తననోటితో నాకది యెఱింగించుట లేదు. కాని యామె ప్రకృతిప్రవర్తనాది లక్షణము లామెనన్ను బ్రేమించుచున్నదని మిక్కిలి స్పష్టముగ వక్కాణింపుచున్నవే!

మఱియు నామెయొక్క యీ ప్రణయలక్షణముల మూలమున నాకు గూడ నింతటి సాహసమొనర్చుటకు బుద్ధి పొడమినది.—నాయోగ్యతమఱచి, శక్తి నతిక్రమించి, ముందంజవేయు నవిచారము స్ఫురించినదే! కానిచో నామెకు నాకు నెట్టిసామ్యము! నానారావువంటి యుత్తముడును, కులీనుడును శ్రీమంతుడునునైన యీనాందారుని సోదరివిషయమున గర్భదరిద్రుడును—మరియు నెవనికి గృహములేదో, యెవనికి యాప్తమిత్ర స్వకీయవర్గము లేదో యట్టి నా కీరిత్తకోర్కె లేటికి? ప్రేమాంధుండవగునో వెఱ్ఱిగంగాధరా? నీకేమైనను స్మృతియున్నదా లేదా? ప్రేమయెదుట ద్రవ్య మేపాటిదియను మాట సత్యమే. కాని యాతత్వమెవ్వనికి? అయ్యది నీయట్టినిష్కాంచనునకా! బాబా! నిర్ధనుని యొక్కయు, మరియు ధనాఢ్యుని యొక్కయు ప్రేమకల్పనలు భిన్నాభిన్నముగ నుండునుగదా!

కాని—ఛీ—నాయీాసమస్తాలోచనలు నా రమణీయమూర్తి యమున స్మరణకువచ్చిన తోడనే యెక్కడివక్కడ పటాపంచలై పోవుచున్నవి.

యమున కిప్పుడు పదునాల్గు వత్సరముల వయసు. ఆమె నిప్పుడు బాలికయనిగాని, కిశోరయనిగాని, యువతియనిగాని స్థిరపరచుట కెంతయోచించినను నాకు సాధ్యము గాకుండెను. కారణమేమన, బాలిక—కిశోర—యువతి వీరియొక్క స్వభావమేకత్రసమ్మేళనమైన నేమనవచ్చునో యది యమునయై యున్నది. బాలికకుగల సరళతయు, కిశోరకుగల చంచలతయు మరియు యువతికిగల లావణ్యమును నివియెల్ల నామెయందు మూర్తీభవించి యుండెను. వాచకమహాశయులారా! ప్రాంజలినై యడుగుచుంటిని. మీారె వచింపుడు. ఇట్టి లావణ్యారసాధిదేవతయు మాధురీమూర్తియు నగుమనోహరయువతిపై నేను నాయోగ్యత విస్మరించి ప్రేమించినయెడల దోషారోపణకు బాత్రుడగుదునా? కాని యీాప్రేమమూలమున నేనెట్టి మహాదుఃఖవార్ధి మునింగితినో, మరియు బాప మా నిరపరాధ సరళబాలికయగు యమున యెట్టిభయంకర యాతనల ననుభవించెనో యీావిషయమును వాక్రుచ్చి దరిద్రయువకుడు తన స్థితి మరచి ధనికుల కన్నెను బ్రేమించిన పరిణామ మెంతటి దుస్సహదుఃఖదాయకమో గనబరచుటకు నాయొక్క నిజోదాహరణము మీాకు గనబరచుట నాయుద్దేశమై యున్నది.

ఒకదినమున నానారావు నాతని పత్నియు దమ శయనగృహ మున గూరుచుండి యేదో వినోదసంభాషణ మొనర్చుచుండ నే గాంచితిని. వారి సంభాషణమందలి కొంతభాగము నాచెవి బడినంతనే నేను సంకుచితమానసుడనైతిని. వారు నాసంబంధమై యేమేమో ముచ్చటించుచుండిరి. అదియేమో యాలకింప నుత్సుకుడనై చెవియొగ్గి ద్వారమున కీవలనిలిచి వారి ప్రసంగ మాకర్ణింపదొడగితిని. సతీపతుల యేకాంతసంభాషణ మాలకించు టనుచితము కాదా? కాని యీవిషయ మాసమయమున బొత్తుగ విస్మరించి కంపితహృదయముతో వారిమాట లాలింపుచు నిలుచుని యుంటిని.

నానారా విటు లనియె "భగీరథీ! నీకుగనుక కొంచెము చదువను వ్రాయను వచ్చియున్నటులైన—"

"అటులైన నే మయ్యెడిది?"

"నీకుగల యీతీక్ష్ణకుశాగ్రబుద్ధివలన నిశ్చయముగ నీవు 'ఆనిబిసెంటు' వంటి లోకోత్తరమహిళారత్నమవై యుండెడి దానవని నే దలంతును."

ద్వారరంధ్రమునుండి గదిలో జరుగుచున్న సకల విషయములను నేను జూచుచునే యుంటిని. నానారావుని యీపలుకులకు భాగీరథి కడుపుబ్బ నవ్వసాగెను. ఎంతో ప్రయాసమున నవ్వు నాపుకొని వినోదముగ నామె యిటులనియె. "ఏమంటిరి;

నేను 'పిసాట్' నయ్యెడిదాననా? నేనటుల గావలెననే కోర్కె మీకు గలదేని నే నటుల నైతిననియే భావింపుము. ఏమి, సరియేనా?"

నానారావు భార్యయొక్క యియ్యజ్ఞానజన్యవినోదప్రచుర వాక్కులకు గౌతుక మంది యి ట్లనియె. "నీకు స్వల్పముగ నైన విద్యాపరిచయము గలిగియుండినచో నా కెంతటి సంత సము గలిగియుండెడిది!"

భాగీరథి తన చుబుకమున నంగుష్ఠము జేర్చి యాశ్చర్యా న్వితయై యి ట్లనియె. "ఏమి? మీరు నన్నంత యడపిమాని సిగ దలంచితిరా? చదువుట వ్రాయుట—ఆమాత్రము— రాదనుకొంటిరా? క ఖ గ ఘ యివి నాకెటుల బాగుగ కంఠ పాఠముగ వచ్చునో చూడుడు."

నానారావు నగుచు నిటు లనియెను. "భాగీరథీ! పాప మిందు నీ యపరాధ మేమియున్నది! స్త్రీలు విద్య నభ్యసిం చుట మహాపాతకమని నీమనసున నేదో యొక వెఱ్ఱిభ్రాంతి కలిగియున్నది. ఆ భ్రాంతిమూలముననే నీవిటుల శిక్షితవై తివి. నీవు సమస్తవిషయములందును నే నెటుల జెప్పిన నటుల నడచుకొందువు. కాని యీయొక్క విద్యావిషయమునందు మాత్రము నా యాజ్ఞ నుల్లంఘించెదవు. ఇందుకు నాకు యదార్థముగ మిక్కిలి కోపము కలుగుచున్నది. ఎఱుగుదువు కదా? నేను నీభర్తను నేను నీగురువును—"

భాగీరథి యర్థోక్తియకదే రయమున నిటు లనియె.

"మంచిది; మంచిది, కాని గురువర్యా! ఈయుపదేశ మింత వఱకు నెందు కొనర్పరైతిరి? గురుమహారాజ్! నేను మీకు బ్రణుతి యొనర్చుచుంటిని. ఆశీర్వాద మొనర్పుడు."

ఇటు లని భాగీరథి స్వస్థముగ నూరకుండలేదు. ఒకానొక భావికశిష్యు డేతీరున గురుచరణములపై బూజ్యబుద్ధి మస్తక ముంచి యెవ్విధమున గురువునకు బ్రణామమొనర్చునో యవ్వి ధముననే నామె పతిపాదకమలములపై శిరముజేర్చి సాష్టాంగ దండప్రణామ మాచరించెను. మఱియు బొంగి పొరలి వచ్చు చున్న హాసమును మిగుల గష్టముతో లోలోన నణచికొని ముకుళితకరకమలయై శిష్యునివలె నానారావు కట్టెదుటనిలువ బడియెను. ఇది యంతయు గాంచ నాకు బొట్ట పగులునట్లు నవ్వు వచ్చుచుండెను. కాని యది హాస్యమునకు సమయము కాదుగదా? అటుల బెద్దతడవు కరములు జోడించుకొని నిలు చున్నమీద భాగీరథి మిగుల నమ్రస్వరమున నానారావున కిటు లని విన్నవించెను. "కాని గురువర్యా! నేను తమ చరణ కమలముల సన్నిధినిటుల నొక్కవినతి సాదర మొనర్చుకొను చుంటిని. రేయింబవళ్లు, వేళయు బాళయు లేక మీయీనమ్ర శిష్యుని కట్టెదుట దమరు సంచరించుచుండినయెడల మీగౌర వమున కించుక హానికరముగాదా? అనగా? నేదో సంవ త్సరమునకో, యారు మాసములకో యొక్కమారు దర్శన లాభము కలుగజేయ గృపజూచినచో గురువర్యునకు యథా శక్తి పాదపూజ యొనర్చి బిక్ష నొసంగుటకు సదుపాయముగ

నుండును.

"సరే, బాగుగయున్నది. ఇంక నేనెన్నడు నీవిషయమున నీకు మరల నుపదేశ మొనర్పబోను. నీవెప్పుడు నన్నిటులేపరిహాస మొనర్చుచుందువు" అని నానారావు కూడ నగుచు ననియెను.

"నాదంతయు బరిహాసమా! గురుమహారాజ్! భవదాజ్ఞాను సరణముగ నేను మిమ్ము గురువుగ భావించితిని. మిమ్ము పూజించుచుందును. మీయాజ్ఞ యెట్టిదైనను శిరసావహించుటకు సిద్ధముగ నుంటిని. ఇందు పరిహాస మేమికలదు?"

"కాని యీ నీపరిహాసము గూడ నాకు మిగుల నిష్టమే."

"ఏమంటిరి? నేదైనా మఱియొకదానియందు మీకిష్టమున్నదా? అయితే మరి పరిహాసము నాసవతి. ఆదుష్టయగు సవతియొక్క—పరిహాసము యొక్క పేరైన నింక దలపెట్టబోను. నడువుడు. మనము మన పూర్వప్రసంగవిషయమున బ్రవేశింతము. మరియమున వివాహవిషయ మేమిస్థిరపరచితిరి?"

ఆహాహా! భాగీరథి యదార్థముగ నంతర్యామి దేవతయేయై యున్నది. మదీయ మానసాంతరాభిలషితమగు విషయమునే ప్రస్తావనకు దెచ్చినదే! కాని వారీప్రసంగమునెత్తుట తోడనే నాహృదయము తటతట గొట్టుకొనుచున్నదేలకో! ఒకానొక నిర్దోష నిరపరాధిపై ఖూనీనేర మారోపింపబడి విచారణ సమయమున న్యాయాధిపతినోటనుండి వచ్చు వాకుము నాలకించుపట్టున నానేరస్థుని స్థితియెటులుండునో యటుల భాగీరథి

యడిగిన యీప్రశ్నకు నానారావు నోటనుండి యెట్టి ప్రత్యు త్తరము వచ్చునో యది వినుటయందు నామనస్థితి యట్లైన దెందులకో? నానారావు గంభీరస్వరమున నిటులనియె. "కాని యీవిషయమున నీకింత యాతురమేటికి?"

"ఆత్రమేటికా? ఇట్టి కాలసర్పము నిక నింటనుంచుకొని పోషించు టెంతమాత్రము శ్రేయస్కరము కాదు. చప్పున వివాహ మొనర్చివేసినచో ముందు రానున్న యనర్థములు రాకుండును."

"యమునపై నీకత్యంతానురాగము కలదని నే నెఱుగుదును. నీవే యాపంచశరద్వయస్కను పెంచి పెద్దదానిగ జేసితివి."

ఇంకను నామె కెంత వయసు రావలయునని మీయభిప్రాయము? నాకేమియు బాగుగ నుండలేదు. అందరు నవ్వుచుండిరి. ఇంత లోకవిరుద్ధ మెందైన గలదా?"

"నీవు వట్టి పిచ్చిదానవు. ఇంతటి బాల్యమున నామెకు బరిణయ మొనర్చుట యుక్తముగాదు."

ఇంకను మీరామెను బాలికయనియే దలంచుచుంటిరా? గడచిన యాశ్వయుజ మాసమునకు పదునాల్గువత్సరములు దాటినవి. ఇంతవర కామెకు వివాహ మొనర్పరైతిరి. మీకెందులకు దోచదు? మీయట్టి సువినీతిపరుల కొకరు చెప్పవలయునా? వివాహమొనర్పకుండ నామె నింకెంతకాల మిట్లుంపవలయునని మీయభిప్రాయము?"

"చూడు నీవు నా భార్యవై యుండియు నీ వెఱ్ఱిముత్తమింకను వదలినదానవు కావు. నీవే సుశిక్షితవై యుండి యిప్పటి వార్తాపత్రికలయందును, మాసపత్రికలయందును జర్చింపబడుచున్న విషయముల నీవు బరికించియున్నట్టులైన నిశ్చయముగ నీ విటుల సంభాషించి యుండవు. బాల్యవివాహము లొనర్చుట యవినీతిదాయకము. బాల్యవివాహపరిణామ మెంతటి భయానకమో నీవు బాగుగ యోచింపవైతివి. ఈ బొమ్మల పెండ్లిండ్లవలన ముందా భార్యాభర్తల సంసారసుఖము మంట గలసి పోవును. వా రొండొరులు భిన్నాభిప్రాయు లగుదురు. ఒకరిమత మొకరికి రుచింపక నెన్నో యిక్కట్టులు వాటిల్లును. ఒకరియం దొకరికి బ్రణయోత్కర్ష ముండనిచో నావివాహ మెంతటి యనర్థదాయకమో నీ యవివేకమానసమున కెటుల బొడకట్టును?"

"నిజమే. నాయట్టి యవ్యక్తురాలిట్టి మహత్తరవిషయముల నెటుల దెలిసికొనగలదు? కాని మీరు కోపపడకుండినచో నేను మి మ్మొకటి యడిగెదను. బాల్యవివాహమువలననే నతి భయానక పరిణామము ఘటిల్లినచో మన యీ హిందూస్థానమున నింతవరకు కోటాన కోట్లు బాల్యవివాహములే జరిగియుండెను. ఇంకను జరుగుచుండెను. అందొక్కటికూడ మీరు వచించిన ప్రకారము సంభవించెనని నే నింతవఱకెప్పుడును వినియుండనైతిని. ఇంతియకాక—మీరుమిక్కిలి మన హిందూస్థానమునందలి దాంపత్యమువంటి దాంనత్యము

ప్రపంచమున మఱియెచ్చటను లేదని వినియుంటిని. ఆర్యస్త్రీల వంటి మహాపతివ్రతలు భర్తను ప్రాణముకంటె నధికముగ ప్రేమించి పతికంటె నన్యదైవము లేదని భావింతురనియు— ఇంతియేగాక నాథుడు మరణించుటతోడనే దమ ప్రాణములు గూడ దృణప్రాయముగ నెంచి యగ్ని నారాయణున కర్పించెడి వారనియు మన కెల్లరకు విదితమైన విషయమే కదా? లక్షకొకరిద్దరు మాత్రమీ యుదాహరణమునకు విరుద్ధముగ నుందురేమో! మఱి యింతవఱకు నీ బాల్యవివాహపరిణామము మీరు వాక్రుచ్చినటు లెందుల కనిష్ఠదాయకములగుటలేదు? ఈ యింగ్లీషుచదువు ప్రారంభమగుటతోడనే మీ కిట్టి యూహాలు పొడముచుండు టేలకో! అంతదూర మెందులకు? మన లగ్నసమయమున మీరు ప్రత్యక్షముగ నా సమ్మతి గైకొంటిరా? మన తల్లిదండ్రులే కాదా మన యుభయులకు బరిణయమొనర్చివైచిరి? అప్పుడు మీకు పది వత్సరములైన నున్నవో లేవో! ఇక నే నన్నో వడసార మైదేండ్ల బాలికను. మన యీ బాల్యవివాహముయొక్క పరిణామ మిప్పు డనిష్ఠమైనదా యేమి? మీరొక్క క్షణము నాదృష్టి బడనియెడల నాప్రాణము లెటుల దల్లడిల్లిపోవునో నేను పొందెడి యవస్థ యీ పరమేశ్వరునకే యెఱుక. ఇంక మీ రన్ననో నన్ను బాసి యొక్క నిముసమైన నుండజాలరు కద? బాల్యవివాహముయొక్క దుష్పరిణామ మిటులే యుండును కాన మనయుమునకు గూడ నిస్సంకోచముగ బాల్య

వివాహమే కానిండు. ఆ మండిపోయిన ప్రౌఢవివాహము యొక్క సత్పరిణామము నా కక్కఱలేదు. ఎక్కడ పిచ్చి తల కెక్కినదమ్మా! ఏమో భగవంతునకే దెలియవలయును."

నానారావు మందహాసమున నిట్టు లనియె. "నే నెల్లరను వాదమున జయింపగలను. కాని నీ దరహాసితముఖమునుండి వెలువడి నాకర్ణకుహరముల బీటువారజేయు నీ ప్రసంగము ముందు నా లెక్చెరంతయు వమ్మైపోవుచున్నదే!"

"అయ్యది యటులుండ నిండు. మీ నిశ్చయ మేమో తొలుత నాకు వచింపుడు."

"ఏమి నిశ్చయము?"

"అనగా! మీ రీయూర లేనట్టు తోచెడిని. అమ్మా! అమ్మా! నన్నెట్లు మరపించెదరు? ఇంతవరకును యమున నవివాహితగ నుంచినారు గాన మీ యభిప్రాయానుసారముగ నామె మరి యిక ప్రీతి వివాహము చేసికొనుట—?'

భగీరథి పలికిన యీ యమృతముకంటె మధురతరమగు వాక్యములు చెవిసోకినంత నా మన సెంతటి సమాధానము బొందెనో యయ్యది నాకే దెలియవలయును.

నానారా విటు లనియె "నేనును నామెకొఱకు మంచి సంబంధము విచారించుచుంటిని. సత్సంబంధము కానరానిచో నెవనికో యొకనికి గట్టిపెట్టుట నా యభిమతము కాదు."

నానారావుని యీ నుడువు లాలించినంత నాతలపై బిడుగు పడినటు లయ్యెను.

మరియొకదినమున నిటులే నానారావు, భగీరథి యేకాంత ముగ సంభాషించుచుండిరి. ప్రసంగసందర్భమున భాగీరథి యీ ప్రసంగము నెత్తి యిట్లనియె "ఇప్పుడు మీ సోదరి ప్రవర్తనాదికము లెటుల మార్పునొందెనో మీరు పరికించి తిరా ?"

నానారావు కరములు శిరమున చేర్చి యిటు లని ప్రత్యుత్తర మిచ్చెను. "నీమానస మెట్లు భ్రాంతమగుచున్నదో తెలియకున్నది. యమున చిన్నపిల్ల. పాపము దాని కింతవరకు నేమియు దెలియదు."

అందుపై భగీరథి యిట్లనియె "మీ రనేక గ్రంథములు చదివియుండినది సత్యమే కాని యచ్చముగ గ్రంథపఠన మూలమున మనుజున కేమియు జ్ఞానాభివృద్ధియగుట లేదు. మీ రిప్పుడు నావలన గొంతవరకు శిక్షణము బొందవలసి యున్నయది. అటులైనగాని మీకుపరేంగితాదుల గనిపెట్టుట సామర్థ్య మలవడదు."

"నీవు చెప్పెడిదేమియో నా కేమియు బోధపడుటలేదు."

"ఏల చెపుమా బోధపడకబోవుట! కాలేజీయందు చదివిన చదువువలన మీకిది యేమియు బోధపడదు. నాకు గల భయ మిప్పుడు యదార్థమై గనుపట్టుచున్నది."

"ఎందువలన నీకిటుల సంశయము గలిగినది? నాకు స్పష్ట

ముగ నొక్కాణింపుము."

"ఇంతకన్న స్పష్టముగ నింకేమి వచింపవలయును? యమునయొక్క సమస్తప్రవర్తనాదికములవలన నింతవరకును మీకు స్ఫురింప నేలేదా? నేనింతకుముం దనేకమారులు విదితమొనర్చియుంటిని. మీరు నామాటలు చెవిబెట్టరైతిరి. ఇప్పుడైన నా పలుకు లాలింపుడు. ఉపేక్ష సేయకుడు. బాల్యవివాహము కూడదు కూడదని దినములు గడపి తుదకనర్థము దెచ్చుకొనవలయునని మీ యభిప్రాయమా?"

"నీ బుద్ధికి సుశిక్షణసంస్కారము ఘటించియుండినటులైన నీవు నిరర్థకముగ నిటు లెన్నటికిని యుచ్చరించి యుండవు. నీ వేమైన ననుము. అశిక్షితస్త్రీతోడ సంసారయాత్ర గడుపుట మిక్కిలి త్రాసదాయకము. నీ భ్రామికమానసమున నీ నిరర్థకవిషయము నిండియుండుటచే నీవాధోరణి విరమింపవైతివి. ఉదాత్తకల్పన లెపుడును నీ మనసున స్ఫురింపవనియే దలంచెదను! సంశయదృష్టితో నీవు జగత్తును జూచుచుండిన"—

"మరి మీ యంతరంగమున నామెకు మహమ్మదీయమతాచారము చొప్పున నిరువదియైదువత్సరములు వచ్చుపర్యంతము పెంచవలయునని కాబోలు—"

భాగీరథీ! నీ కాదినముననే జెప్పియుంటిని గదా? మంచి సంబంధము కుదిరినచో నొకటి రెండువత్సరములలోనే యమున వివాహము జేసివైచెదనని. ఇప్పు డప్పుడే దానిని గూర్చి యంత త్వరపడవలసిన యవసరములేదు. త్వరపడిన మంచి

సంబంధము కుదరదు. నేను వరాన్వేషణ మొనర్చుచుంటిని. వరుఁడు దొరకినచో జూడవచ్చును."

"వరాన్వేషణ విషయమున మీ రిప్పుడు శ్రమపడ నక్కర లేదు. ముహూర్త నిశ్చయము మాత్ర మొనర్పుడు. మీ కింక నెట్టి ప్రయాసయు నక్కఱ లేదు."

భాగీరథియొక్క యీనుడువు లాలించి నానారావ్ వాశ్చ ర్యచకితుఁడై తదేక దృష్టితో నామె వైపు జూచుచు గొంత తడవున కిట్లనియె "నీవేమంటివి? నా కేమియు దెలియుట లేదు"

అందుకు భగీరథి నగుచు నిటులనియె "ఆలస్యమైన యెడల బ్రీతి వివాహము గాక తప్పదని నేనానాడే మీతో వచించియుంటిని కదా?"

"ఏమో నా కేమియు నీ మాట లర్థమగుటలేదు."

భాగీరథి బింబాధరముపై మధురమందహాసము విలసిల్ల సాగెను. ఆమె తలపంకించుచు నిటులనియె "క్రమ క్రమముగ సర్వమును మీకు దానంతటనదియే తెలియవచ్చును. ఇది మా బోటి యవివేక యశిక్షితుల విషయము. ఇట్టిది మీ వంటి విద్వాంసుల కొక్క పరి తెలిసికొన శక్యమగునా?"

"దయయుంచి యదియేమియో నాకు స్పష్టముగ నెఱిగింపుము."

భాగీరథీబాయి గంభీర స్వరమున నిట్లనియె "మీ రేయూహతో యమున వివాహవిషయమున దటస్థులై యుం

కిరో యట్టి యూహతోడనే యామెయే యా ప్రయత్న భారమును తన శిరమున నిడుకొని తనవరుని దానే యన్వేషించుకొనియెను. ఇప్పుడైన మీకు దెలిసినదా? మాముద్దుల వదినె తన మనోధన మొక్క యువకుని కర్పణజేసియున్నది"

భాగీరథి నోటనుండి వెడలిన యా వాక్యములు నాకర్ణముల జొచ్చినంతనే నాహృదయ మతివేగమున గంపింపసాగెను. ఏకాగ్రదృష్టిని నానారావు మొగమును వీక్షించుచు నేనిలచి యుంటిని. నానారావు భగీరథి ముఖమున నాపలుకు లాలించి మహావిస్మితుడై పోయెను. ఆతడిటులనియెను. "ఆ—యేమి? యమున యెవ్వని ప్రేమించినది?"

ఆ సమయమున నామనస్సెట్టుల గలవర మొందుచుండెనో యయ్యది నాకెదెలుసును. తక్షణమున భాగీరథి యిట్లనియె "ఇంకెవ్వని—మనగంగాధరుని"

ఇదివినుటతోడనే నిలుచునియున్న నేను నేలపై గూలబడితిని. మరి యమున నాయందు బద్ధానురాగయై యుండెనా? పెద్దతడవు వరకు నాశ్రవణముల కేమియు వినరాలేదు. తిరిగి మెల్ల మెల్లన లేచినిలువబడితిని. నానారావు ముఖ మవలోకించినంతనే నేనుమిగుల భయాకులితమానసుడనైతిని. చాలసేపునకు నానారా విటులనియెను. "యమునకింతవరకు బాగోగుల దెలిసికొను సామర్థ్యము కలుగలేదు. ఆమెకింతటి స్వాతంత్ర్యము నే నేమాత్రము నొసగియుండలేదు. మన గంగాధరుడు బహుయోగ్యతగలపిల్లవాడు. మరియు నాకుగూడ వానిపై

నతిప్రేమము. ఇవియన్నియు సత్యమే. కాని యమున నాతని కొసగి వివాహమొనర్చు టెన్నటికిని సంభవింపదు. ప్రప్రథమమున నిదినాకు నిజమని తోచుటలేదు. ఒకవేళ నీవువచించినదే సత్యమగునెడల రాబోవుమాసములోపలనే తగువరుని విచారించి యమునకు బరిణయము చేసివైచెదను."

నానారావుని యీ భాషణములవలన నామానసికావస్థ యెటులయ్యెనో వాచక మహాశయులకు నేనెటుల విదితమొనర్తును? పాపము భాగీరథి ప్రఫుల్ల వదనారవిందము గూడ వెంటనే మ్లానమైపోయెను. ఆమె యిట్లనియె. "కాని మీరటుల గావించిన యెడల యమున యేమాత్రమును సుఖపడబోదు."

ఈమాట వినగనే నానారావు విస్మితుడై పోయెను. కొంత తడవేమో యోచించి తదనంతర మాతడిటులనియె. "భాగీరథీ! నీయీపలుకులయందు నేనెటుల విశ్వాస ముంపగలను? యమునయింతవరకు గూడ కేవల మజ్ఞానబాలికయై యున్నది. మరియు గంగాధరుడన్ననో నామెకుశిక్షకుడు. శిక్షకాసంబంధమువలననామె కాతనియందుభక్తిప్రియాదులు గలిగియుండును. తద్విషయికమగు యాదరపూజ్యభావముల గనబరుచుట వలన నీవది ప్రేమయని భావించియుందువు."

"ప్రియము, భక్తి, యాదరము వీనికన్న ప్రణయము నిజముగ భిన్నమైయున్నది. ఇట్టి నమ్మకమునాకు గలిగియుండినందుననే నాకావిషయమున సంశయము జనింపలేదు."

"నీమనసున నేదేని సంశయ మొక్కమారు ప్రవేశించి

నటులైన యది నిన్న నిశమునుగలంచివైచి విడువనేరదు. సరే యొకవేళ నీవచనానుసారముగ నంతయు యదార్థమే మైయున్న యెడల నాకామె వివాహావ్యవస్థల నిర్వర్తించుట యవశ్యకర్తవ్యము."

"ఇదిగో చూడుడు. వరాన్వేషణమం దితరత్రవిచారించు విషయమున మీరింక బాధ్యతగ్రైకొనకుడు. పరమేశ్వరు డేది సంఘటించియుంచెనో యద్దాని కంగీకృతులమై గంగాధరునకే యామె నుద్వాహమొనరింతము. ఏదైన నొక మహదైశ్వర్య గృహమున నామెను బడవైచి వారిద్రవ్యమువలన మనముదర నిర్వాహకము జేసికొన నావశ్యకతలేకుండగనే భగవంతుడు మనకింత స్థితిగతుల నొసంగి యుండెనుకదా? ఇచ్చయున్నచో మీరేయొకనిని శ్రీమంతునిగ నొనర్పగలసమర్థు—"

"ఏమనుచుంటివి? యమునను గంగాధరునకొసగుమనియా? నీ మనసుస్థిరముగనున్నదా? నీకేమైన నున్మాదముజనింపలేదుకద?"

"ఎందువలన? ఆతడు మనజాతివాడు. అందునను సమాన కులీనుడు. మరియుమనమాతనినిస్వజనునిగ భావించియుంటిమి. ఇదియునుగాక గంగాధరునివంటి నమ్రసుశీల సద్గుణబాలకుడు మనకెందైన నొక్కడేని దృగ్గోచరుడయ్యెనా?"

"నీవు వట్టి పిచ్చిదానవై పోవుచుంటివి. వెనుకముందు లాలోచింపవైతివి. గంగాధరునకే యముననొసంగినచో మరి మన కీప్రపంచమున దలయెత్తికొని తిరుగుట కాస్కారము కలదని నీకు దోచుచున్నదా? నేనెంతముచ్చట బడుచుంటిని!

ఆమెవివాహము పదివేలరూప్యముల వెచ్చించి యెంతయో వైభవముగ జేయ సంకల్పించియుంటినే."

"కాని గంగాధరున కొసగుపట్టున నిరువది ముప్పదివేలు వ్యయమైనప్పటికిని యదిసార్థకమని తోచుచున్నది."

నానారావు విరక్తుడై యిట్లనియె "నీ వేదోవినోదముగ మాటలాడుచుంటివని నేదలంచెదను."

భాగీరథిఖిన్నవదనయై యిటులనియె "ఈసమయమున నే నేమియు వినోదముగ సంభాషించుటలేదు. నాగారాబువదినె కొరకు నామన సెంతయలమట నొందుచుండెనో యవ్విధమున నే పాపము సాధుశీలుడగు గంగాధరుని విషయమునగూడ నల మట నందుచున్నది. వారిరువురు బరస్పరము దమ మనసుల నర్పించుకొనియుండిరి. ప్రేమాంకురములు వారిహృదయసీమల నాటుకొని నానాటి కభివృద్ధినందుచున్నవి. అయ్యవి పెకలింప నేరికిని శక్యముగాదు.

అయ్యవినాశన మొనర్ప బ్రయత్నించినచో క్షేత్రమునకు హానికలుగునేమోయని నాకుభయమగుచున్నది. అందువల ననేమిమ్మింత వినయపూర్వకముగ బతిమాలుచుంటిని. మీారం దుకు వ్యతిరేకమేమైన నొనర్చిన యెడల నిజముగ దానివరి ణామము దుఃఖదాయకమగును.

నానారావు క్రుద్ధస్వరమున నిట్లనియె "ఏమనుచుంటివి? గంగాధరునకు గూడ యమునయందు ప్రేమకలదనియా?"

భగీరథి తక్షణమే ప్రత్యుత్తర మిచ్చెను. "ఏమి, ఇదెట్లై

చమత్కారమైన ప్రశ్న? ప్రీతికరమగు యోగ్యవస్తువిషయమున నెవ్వడు ప్రీతుడు గాకుండును? మరియు ప్రేమించిన వారి నెవ్వరు ప్రేమింపకుండ నుండగలరు?"

నే నాసమయమున మనసునం దిట్లనుకొంటిని. తల్లీ భాగీరథీ! నీవు యదార్థముగ నీ ప్రపంచమున నెవ్వరో యొక శాప భ్రష్ట దేవతవై జన్మించియుండువు!

కాని నానారా వందుపై నేమియు బ్రత్యుత్తర మొసగ లేదు. చాలా సేపటివర కాత డాలోచనాధీనుడై స్తబ్ధముగ గూర్చునియుండెను. తుద కాతడు నిశ్చయాత్మక స్వరమున నిటు లనియె "ఏమైననుసరియే, నేను గంగాధరునకు మాత్రము యమున నిచ్చి వివాహ మెన్నటికి నొనర్పను."

భాగీరథి నోటనుండి సహజముగ నిటుల వెలువడెను "అటులైన నిశ్చయముగ యమున యదృష్టమున సంతత దుఃఖమే లిఖించియుండె గాబోలు!"

ఇటుల బలుకుచుండగనే హరిణమువంటి భాగీరథి చంచల నయనములనుండి ముక్తాఫలములవలె రెండశ్రు బిందువులు రాలెను. నేను నిజముగ జెప్పుచుంటిని. నాజీవితమునం దెన్నడును భాగీరథి నేత్రములయందు బాష్పబిందువులజూచి యుండనైతినే!"

మరునాటియుదయమున నానారావు దివాణఖానాయందొక చాపుడుకుర్చీపై నుపవిష్టుడై యుండి యొక్క సేవకునిచే నన్ను రమ్మని వర్తమానమంపెను. నానారావు నన్ను లోనికిరమ్మనె నను సేవకుని నుడులాలకించినంతనే లజ్జాభయంబు లొక్కుమ్మడి నన్ను గ్రమ్ముకొని హృదయముఁ గంపింప దొడగెను. ఏ మొగము బెట్టుకొని నానారావు సముఖమున కరుగుదును? ఈయాలోచనవలన చాలాసేపు మనంబున విచారించుచు గూర్చుండియుంటిని. అనంతరము కొంతతడవునకు సంచలితాంతరంగుడనై నానారావు కూర్చునియున్న దివాణఖానా కరిగి యాతనికట్టెదుట నిలువబడితిని. ఈదినమాతని మోము గాంచుటకు నాకిసుమంతయు ధైర్యము గలుగదయ్యెను. తల వాంచి మూగవానిచందమున స్తబ్ధముగ నిలుచునియుంటిని. ఆసమయమున నాహృత్పేటికయం దెట్టి తాళమృదంగాది భిన్నాభిన్న చమత్కారిత ధ్వనులగుచున్నవో యయ్యవినాకే విదితము. కొంతతడవునకు నానారావు నాతో నిటులనియె "గంగాధరా! యమున వివాహమిపుడు సేయవలయునా వలదాయను విషయమునుగూర్చి నీసలహాదీసికొనదలచి నేను నిన్ను బిలిపించితిని. ఇందుకు నీయభిప్రాయమేమి? యమున వివాహమిప్పు డొనర్చుదమా?"

ఈప్రశ్న వినుటతోడనే నేను మూర్ఛితుడ నైబోతిని.

ఈ ప్రశ్నకు నేనేమని ప్రత్యుత్తర మొసగవలయునో, యేమని వచింపవలయునో యెంత యోచించినను చాలాసేపటివఱకు నాకు స్ఫురింపదయ్యెను. తుదకు బెదరుతడవునకు భయపడుచు భయపడుచు నే నిట్లంటిని "అవును. ఇప్పుడామె వివాహ యోగ్యయై యుండుట నిశ్చయమే!"

చోరదృష్టిని మెల్లగ నేను నానారావు మొగము వీక్షింపు చుంటిని. అప్పుడాతడుకించిత్స్వాకారములును, గంభీరములును నగు చూపులతో నన్ను బరికించుచు తిరిగి యాతడిట్లనియె "ఏదేని ప్రశస్తమగు సంబంధము నీవు చూడగలవా?"

నేను మరల నాలోచనాసముద్రమున బడితిని. సరియేయని యెటులవచింతును! కాదని యెట్లు చెప్పగలను! నామనను మిక్కిలి కలవరమందుచుండెను. పిమ్మట దడబడుచు నేనిటు లంటిని. నా—న—నె—నాకు—నాకంతటి సామర్థ్యములే—"

నానారావు ముందటివలెనే నావైపునకు దృష్టులబరపి చూచుచుండెనని నేనిప్పటికిని కనిపెట్టుచునే యుంటిని. అతడు మూడవమారు నన్నిట్లు ప్రశ్నించెను. "సరే, యమునకొఱకు నీవేదైన మంచిసంబంధము జూచెదవా?"

నే గ్రహించితిని. ఇట్టి ప్రశ్నలవలననాయింగితమును గ్రహింప వలయునని నానారావుని యుద్దేశము. ఇది నేనెఱింగియేయుం టిని. భాగీరథివలన నీవరకే నిజవృత్తాంతమంతయు నాతడు దెలుసుకొనియే యుండెనుకదా? అటులగుట నిప్పుడద్దానిని దాచియుంచుటవలన నేమిప్రయోజనము? అని యోచించి నే

నిటులంటిని "ఆకార్యము నావలన యథాయోగ్యముగ నెఱ వేరుసని నాకు దోచదు. అటులైయుండియు మీరందులకు సన్నాజ్ఞాపింతులేని భవదాజ్ఞానుసారముగ బ్రవర్తించుట నాకు గర్తవ్యమైయున్నది."

నాయీప్రత్యుత్తర మాలకించి నానారావు కొంచెము యోచనానిమగ్నుడైనట్లు గన్పట్టెను. తరువాత నాతడిట్లని యె "బాల్యమునుండియు నీవు యమునను ప్రాణముకంటె నెక్కుడు ప్రీతితో జూచుచుంటివి. ఆమె యభివృద్ధికొఱకే ప్రయత్నించుచుంటివి. ఇయ్యది నేనెఱుగుదును. మరి యామెకు సర్వసద్గుణరూప సంపన్నుడగు వరు నన్వేషించి పరిణయమొనర్చి యామె సుఖింపుచుండ గాంచుట నీకిష్టములేదా? ఆమెకొరకొక సత్సంబంధము శోధించువిషయమున నీవేటికి యుత్సాహివి గాకుంటివో తెలియుటలేదు. నాకిటుల తోచుచున్నది. నీవామె నతిగారాబమున జూచుచుండెడివాడివుగాన నీవేయామెకు తగువరు నరయుట యుత్తమోత్తమము. ఈకార్యము నీవలన నెరవేరు నట్లితరులవలన నెరవేరుట యసంభవము. మరియెందులకు చెవుమా నీవీకార్య భారము వహించుటకు సందేహింపుచుంటివి?"

"మీరు పెద్దలశిరముపై నుంపవలసిన భారము నాపై మోపినచో నేనదెటుల భరింపగలను? ఈ విషయమున మీరెట్లాలోనర్తురో యదియే ప్రశస్తముగ నుండును. నేను కేవలము బాలుడను."

నానారావిటులనియె "శ్రీమంతుడగు నొకసుఖవస్తుగృహ స్థునింట యమునను బడవేయవలయు నని నాయభిలషితంబు"

"తమబుద్ధికెటుల దోచునో యటులొనర్పవచ్చును. అనేక విద్వాంసులు, సుశీలురు, శ్రీమంతులునగు యువకు లనేకులు యమున కరగ్రహణ లాభ మొదవెనేని తాము ధన్యులైన టుల దలంతురు."

అందుపైన నానారావించుక హాస్యయుక్తస్వరమున నిటుల నియె. "కానినేనేయొకదరిద్రునకుయముననొసగినటులైన"——

"ఇది మీయిచ్ఛపైన ధారవడిన విషయము. మీమనసున కదియేసమ్మత మయ్యెనేని యటులగూడ నొనర్పగలరు. కాని నాకిట్లు దోచుచున్నది. అంతటి పుణ్యము జేసుకొన్న ప్రాణి నేనెఱింగినంతవరకీభూలోకమున మాత్ర మెచటను లేదు."

మరికొంత తడవించుక మిన్నకుండి నానారావిటులనియె. "సరే తెలిసినది నీకే యమున నొసగినచో——"

నేనింతదనుక నిలుచుని యుంటిని. అంత మెల్ల మెల్లగ గూరుచుంటిని. గడచిన దినము భాగీరథి యెంత వేడికొనినను నానారావు యమునను నాకొసగుటలేదని ఖండితముగనుడివి యుండెను. మఱియిప్పుడిట్టి ప్రస్తావన మొనర్చుటకు గతమే మైయుండును? నేను స్వప్నావస్థ యందుండలేదుకద! కాని యిది స్వప్నము మాత్రముగాదు. నానారావు నిశ్చయముగ నాకు మార్మికహృదయభేదనము గలుగుటకు సాధ్యమగు

ప్రయత్న మొనర్చుచుండెను. యమునను బ్రేమించుటయె నేడి నేనొనర్చిన మహాపరాధమునకు దగిన ప్రాయశ్చిత్తమగుగాక యని యాతడీయసంభవనీయ ప్రస్తావన మొనర్చి యుండెను.—నిజముగ నీపలుకులయందేదో గూఢార్థ ముండి తీర వలయును. యమునను నేను ప్రేమించి యుండుటసత్యము. కాని యామె కరగ్రహణ మొనర్చు భాగ్యము నాకు గలుగదను విషయము నిర్వివాదమైయున్న దే? మరినాహృదయక్షేత్ర మున నీయాశాబీజము లంకురితము లగుచున్న వేటికి? మరి నిరాశాసాగరమున మునింగిపోవుచున్న నాకుతుట్టతుదకు శాంతి నొడగూర్చు నిమిత్తము నానారావిటు లనుచుండలేదుకద? నానారావు మనసున నెటులైన నుండనిమ్ము. ఈసమయమున నాతో తిరిగియాతడిట్లనియె “ఏమి, నేనడిగిన ప్రశ్నకు బ్రత్యుత్తర మీయవైతివి?”

ఇంక ధైర్యముగ నుండలేక బోతిని. నానేత్రద్వయ మశ్రు పూరితమయ్యెను. కన్నులుదుడిచికొనుచు నేనిటులబల్కితిని. “నేనతిశయ దరిద్రుడనై యుంటిని. మీ కేవల కృపాప్రసా దముపై నాజీవిత మవలంబితమైయున్నది. ఈ పృథ్వీతలమున మీరుతప్ప మరెవ్వరును లేరు. నాకుతల్లిదండ్రులైనను, బంధువు లైనను మీరె—అయ్యో! మీరేటికిటునను హాస్యోక్తుల హింసించెదరు?”

నాయీస్థితికాంచి నానారావు మనసున నించుకజాలి పొడ మినట్లు గనుపట్టెను. నన్ను సాంత్వనమొనర్చుచు నాతడిటులని

యెను. "ఈ విషయమున నీవు వచించిన అభిప్రాయముతో నిన్నె వియు నేనడుగలేదు. బాలకునిచందమున నేటి కిటుల విల పించెదవు ?"

నానారావుని నోట నే నీనుడులాలించగనే మిగుల విస్మితు డనై యాతనివంక జూడదొడగితిని. నేను జాగ్రదాయవస్థ యందుంటినో స్వప్నావస్థయందుంటినో చాలా సేపటివరకు నాకు దెలియరాద య్యెను. మరల నానారా విటులబల్కెను. "యమునను బరిణయమగుటకు నీకిచ్ఛయున్నదా లేదా ?!"

ఈ ప్రశ్నకు నేనేమని ప్రత్యుత్తరమిత్తును? నేను మెల్ల మెల్లగ నిట్లంటిని. "ఇచ్ఛానుసరణముగ సమస్తముసంఘటనమగునా?"

అందులకు నానారావు తిరిగియిట్లనియె "యమున నీయర్థాంగియగుట నీకు సంతోషదాయకముకాదా యేమి ?"

నాకు దెలియకుండ నానోటనుండి యీపల్కులు వెలువడెను. "సమస్త పృథ్వీరాజ్యమును నా కొసంగినప్పటికిని యంతటి యానందము నాకు గలుగబోదు."

కించిత్కాలము స్తబ్ధుడై యుండి నానారావు గంభీరస్వరమున నిటులనియె "కాని నీవొక్కటి చేయవలసియున్నది. ఇతర సమస్తవిషయములందును యమునకు నీవు తగిన వరుడవగుట మాత్రము నిశ్చయమే. కాని నీయట్టి దరిద్రునకు నామెనిచ్చి నేనెటులవివాహ మొనర్పగలను ? దుర్ఘటప్రయత్న మొనర్చి పదివేల రూప్యము లార్జించి తీసికొని వచ్చినయెడల యమున నిచ్చి నీ కుద్వాహ మొనర్తును. ఇంతటి ద్రవ్యము నీ

వెంతకాలములోపల సంపాదింపగలవో, దెల్పుముచూతము.”

నేనించుక స్వస్థచిత్తుడనై యిటుల బ్రత్యుత్తరమొసగితిని. “ఎన్ని దినములలోపల సంపాదింపవలయునని మీాయపేక్ష ?”

నానారావిటులనియె. యమున యిప్పటికే పెండ్లియీాడు మీారియున్నది. అంత యధికమైతే నీకొక వత్సరము గడు వొసంగెదను. ఒక్కసంవత్సరముకన్న నెక్కుడుగ నొక్కదిన మైన నిచ్చుటకు వలనుపడదు. ఒకయేడాదిలోపల బదివేలరూ కల నీవార్జించి తేగలుగుదువాలేదా వచింపుము.”

“మనుష్యసాధ్యమగునేని యటులే సంపాదించి తెత్తును.”

“కాని చోరత్వము అసత్యము మొదలగు నకార్యాచరణ ములవలన ధనసంగ్రహ మొనర్పగూడదు.”

అందుకు నేనిటులంటిని “రాత్రిందివములు సన్మార్గమున వర్తించి నేను పరిశ్రమ మొనర్చెదను. మరియు నీపదివేల రూప్యములు సంపాదించువిషయమున నాశక్తినంతయు ధారపోసి ప్రయత్న మొనర్చెదను. ఆ ప్రయత్నము నందొకవేళ నాకు మృత్యు వాసన్నమైనను నయ్యదినాకు సుఖదాయకముగనే యుండును.”

“నీయందు నాకు సంపూర్ణ విశ్వాసముగలదు. నేను నీ కొక్క యముననే దాన మొసంగను, ఆమెతో బాటింక పది వేలరూకల గూడ నీకొసంగెదను.”

“యమునాబాయి నాకు లభించిన యానందముకంటె నతిశయానందము నాకెవ్వరైన నీసంపూర్ణపృథ్వీతలమునగల

సమస్తైశ్వర్యమునుగూడ నొసగినను గలుగబోదు."

"కానినాతో నీవొక్క ప్రతిజ్ఞ చేయవలయును."

"అదియేమో వచింపుడు—"

నానారావిటులనియె "నీకింతటి రొక్క మొక్క వర్షాంతరమున జిక్కనియెడల నీవెప్పటికి నిక్కడకు రాబనిలేదు"

"మీరియ్యది నాకాజ్ఞాపింపక బోయినను నేనటు లొనర్చుటకు గృతనిశ్చయుడనయ్యేయుంటిని. మంచిది. నే నటులే ప్రతిజ్ఞ గైకొంటిని."

నానారా విటులనియె "ఈదినము కార్తీక శుద్ధయేకాదశి. రాబోవు కార్తీక శుద్ధదశమి పర్యంతము నీ రాకకై వేచియుందును."

"మీకు నాయం దింతటి కృపగలిగినందులకు నే నాజన్మాంతము మీకు ఋణస్థుడనై యుందును." అని నేను కృతజ్ఞతాసూచక స్వరమున వచించితిని.

నానారా విటు లనియె "అందులకై నన్ను బ్రస్తుతింపవలదు. ఏమైన బ్రస్తుతింపవలసియున్న చో నీవు భాగీరథినే బ్రస్తుతింపుము. ఆమె ప్రార్థనామూలముననే నే నీవిషయమున నంగీకరించితిని—"

అంతనేను మానసాంతరమున భాగీరథీబాయికి మెన్నియో ధన్యవాదము లొసంగితిని. నానారావిటు లంగీకరించుట భాగీరథీబాయి యశ్రువులే కారణములని నామనసునదోచెను.

తత్క్షణమున దేశాంతరమున కరుగ నిశ్చయించి నే నాప్రయత్నమున నుంటిని. కాని దేశాంతరగతుడ నగుటకు భార్య మొక్కసారి యమున సుందరముఖకమలము కన్నులకఱవుదీర వీక్షింపకుండగను, మరియు శ్రవణానందముగ నొక్క మారామె నోట సుమధురవాక్కుల నాలకింపకుండగను గృహము నుండి వెలువడుటకు నాకా లెటుల సాగును? ఈ సందర్భమున యమునయొక్క తియ్యని పలుకొక్కటి నా చెవిబడియేని నాసామర్థ్యము వేయిమడుంగు లధికము కాగలదు. మరియు యమునయొక్క ప్రోత్సాహము నాకు గలిగెనేని యొక్కవత్సరములోపల నేను నిస్సందేహముగ, నిరాటంకముగ పదివేల రూప్యములు సంపాదింపగలను. కాని యామె దర్శనభాగ్యము నా కెటుల లభించును? ఇట్టి విచారమున నేను మగ్నుడనై యుండ నింతలో నాకట్టెదుట సాక్షాద్దయామూర్తి—భాగీరథీబాయి ప్రత్యక్షమయ్యెను. ఆమె నన్ను జూసినంతనే నేను దుఃఖోద్రేకమున నిటు లంటిని. "అమ్మా! నేను—"

ఆమె నామాటల వినుపించుకొనకయే యిటులనియె "గంగాధరా! నీవుద్యోగముకొఱకు బొంబాయి కరుగనుంటివట యేమి?"

ఎచటి కరుగవలయునో నేనింతవఱకు స్థిరపరచుకొనియుండలేదు. భాగీరథీబాయి బొంబాయిపేరు తలపెట్టగనే నేను సహజముగ నిటు లంటిని. "అవును బొంబాయికి వెళ్లవలయు

వని యనుకొంటిని. కాని యింతకు బూర్వమది నిశ్చయించుకొని యుండలేదు."

నాయీ ప్రత్యుత్తరమునకు భాగీరథీబాయి యిటులనియె "గంగాధరా! నా కొక పని చేసి పెట్టెదవా? నీకు చాలపున్నెముండును—"

"ఏమిపని చేయవలయునో వచింపుడు—నేనద్దానిని సంతోషపూర్వకముగ శిరసావహించి యొనర్తును."

భాగీరథీబాయి యొక చేపేటికను దెచ్చి నా చేతనిడి యిట్లనియెను. "ఈనాసొమ్ముల బొంబాయికి గొనిపోయి విక్రయించివైచి యాపైకము నాకు దెచ్చియిమ్ము."

భాగీరథీబాయి శరీరమున ధరించుకొను నమూల్యమగు గొప్పగొప్ప నగలనేకము లాపేటికయందు గలవు. ఆతొడవుల నామె యేటికి విక్రయమొనర్పుమనియెనో యది ప్రప్రథమమున నా మనసునకు బొడగట్టినది కాదు. అందువలన నేను విస్మయమందినవాడనై యామెతో నిటులంటిని "అమ్మా! ఏటికీనగలను మీ రమ్ముచుంటిరి?"

"ఈయాభరణములయం దిప్పట్టున నాకు విసువుజనించినది. అందువలన నివి విక్రయింపవలయునని యోచించితిని."

భాగీరథీబాయి స్వభావము నేను బాగుగ నెఱిగియుంటిని. క్రమక్రమముగ నామె యాశయముగూడ నాలక్ష్యమునకు స్ఫురించినది. వెంటనే యామెతో నేనిటులంటిని "అమ్మా! మీయీపల్కులు నాకేమాత్రమును నిజముగ గన్పట్టుటలేదు.

ఈయాభరణ విక్రయోద్దేశమును మీరు నాకు స్పష్టముగ నెఱిగించినగాని సరియైన ప్రత్యుత్తర మీయజాలను."

భాగీరథీబాయి కొంచె మత్యప్తయై యిట్లనియె "అందలి యదార్థము నీకు దెలుపవలయునాయేమి? అటులైన వినుము. నూతనాభరణముల జేయించుకొనవలయునని నాయభిమతము"

నేను తత్క్షణమిట్లు ప్రత్యుత్తరమిచ్చితిని. "నానారావుగారితో మీరీవిషయమును వాక్రుచ్చి యుండినయెడల వారు మీ యిష్టానుసారముగ నప్పుడే వేఱుతొడవుల జేయించి యిత్తురే. వారికీవిషయము మీ రేటికి కెఱిగింపరైతిరి?"

ఇందుకు భాగీరథీబాయి మందహాసమొనర్చుచు నిట్లనియె "స్త్రీలు తమసమస్త గృహకార్యవిషయములు భర్తల కెఱింగింప నెక్కడ యవకాశముండును? నిన్ను నానిజసహోదరునిగ భావించియుంటిని. అటులగుట నీకీ కార్యము నెఱింగించితిని."

"కాని మీకు పసందుగనుండు నగలను నే నెటుల దయారు చేయింపనేర్తును? నే నింతవరకట్టి తొడవుల నెన్నడు జేయించి యుండలేదే!"

"నిన్ను నవీనభూషణముల జేయింపుమని యెవ్వరు చెప్పిరి? వీనిని విక్రయము మాత్రమొనర్చి రొక్కముదెమ్ము. ఇంతియే నేనునీకు జెప్పునది."

"నూతనాభరణములు వలదామీకు? మరి వీనిని విక్రయించు టెందులకు?"

"నాకు రొక్కమక్కరగలిగి యున్నది—"

"ఇప్పుడు మీకంతటి ద్రవ్యావసరమేమి తటస్థించినది! మీనోట యీమాట వెలువడుటయే తడవుగ నెరవేర్చుటకు నానారావుగా రెల్లప్పుడు సంసిద్ధులై యుందురే!"

"సరే ప్రస్తుతము నా కేమియు ధన మొసగనక్కఱలేదు. కావలయునెడ నీ వద్దనే యుండనిమ్ము. నాకవసరము బట్టి నప్పుడు నిన్నడిగి పుచ్చుకొందును."

భాగీరథీబాయి యాశయము నాకిప్పుడు స్పష్టముగ దెలిసి పోయినది. ఈసమస్తాభరణములు విక్రయించినయెడల పదివేల కన్న నెక్కుడుగ ఖరీదురాగలదు. ఇదికూడ నామనసునకు స్ఫురించెను. నేనిటులంటిని "కాని యింతటి యెక్కువరొక్కము నా వద్దనుంచి కాపాడుట నాకెటులసాధ్యమగును? నేనేగెడిది పరదేశము. అచట నాకు కొంపాగోడా, పెట్టాబేడా! సత్రా భోజనము మఠానిద్ర, నాస్థితి యిటులుండును. ఇదియునుగాక యీ ద్రవ్యములో గొంతభాగము నా క్రింద వ్యయమైనను మాట దక్కదే!"

భాగీరథి మోముదమ్మి మిగుల వికసింపసాగెను. ఆమె నవ్వుచు నిటులనియె "నేనీధనమును నీ కడనుండి యెన్నటికిని నడుగబోను—నీ కెప్పు డిచ్చుటకు వసతియగునో యప్పుడే మరల నాకివ్వవచ్చును. మరి సరియేనా?"

"మీ యభిప్రాయము నాకు దెలిసిపోయినది. కాని యిట్టి పని నా వలన నెప్పటికిని జరుగబోదు."

భాగీరథీబాయి ప్రఫుల్లవదన మాకస్మికముగ మ్లానము య్యెను. ఆమె మిక్కిలి జాలిగదుర నిటులనియె "ఎందువలన గంగాధరా?"

నానారావుగారి సమక్షమున నే నీ ద్రవ్యము చోరత్వము వలనగాని, ఋణమువలనగాని, మోసమువలనగాని సంగ్రహ మొనర్చుటలేదని ప్రతిన గైకొంటిని."

కాని యిది చోరత్వము, ఋణము, ఇంకను మోసము నెటులగును?"

"నానారావుగారి కెఱుకలేకుండ మీరు నాకీతొడవుల నొసగుచుండిరి. అటులగుట నియ్యది మోసమనియే తలంప వలయును."

భాగీరథీబాయి సంతాపమున నిట్లనియె "నీవెన్నటికిని నా యాజ్ఞ నుల్లంఘించువాడవు కావని నాకు మిక్కిలి నమ్మక ముండెడిది. నా పల్కులిటుల దిరస్కరింతువని కలనైన దలప నైతిని."

"తల్లీ నన్ను క్షమింపుము. ఈ విషయమున మాత్రము నీ మాట కెదురాడక తప్పదు."

అంతయామె నవ్వుచు నిటులనియె "అయితే గంగాధరా! నేను నిన్నొకటి యడుగుచుంటిని. ఈయాభరణములు వారివా లేక నాయవియా? ఇవి వారివే యనుకొను చుంటివా? ఇందు నా కేమియు సంబంధము లేదనియా నీ యభిప్రాయము?"

" నానారావుగారు మీ కివి యొసగియుండిరి. అందువలన

నివి యిప్పుడు మీవి యైనవి."

"అవునా, మరి వీనిని గ్రహింపుము. నేను వీనిని నీ కిచ్చుచుంటిని. ఇప్పుడివి నీవి యగుటలేదా?"

మానసాంతరముననే భాగీరథీబాయికి శతవిధములధన్యవాదములొనర్చుచు నే నిటుల బల్కితిని "కాని నానారావుగారికి దెలియకుండ నేనీభూషణముల స్వీకరింపజాలను. ఒక్కవత్సరములోపలనే యీద్రవ్యము సంపాదించి తేవలయునని వారు నా కాజ్ఞాపించుటకు వారి ముఖ్యోద్దేశమేమో వారింతవరకు నా కెఱింగించి యుండలేదు. నేను విశ్వప్రయత్న మొనర్చి యొక్కవత్సరాంతముననే దశ సహస్ర రూప్యముల నార్జించి తెచ్చియిచ్చెదనని వారితో తీవ్రప్రతిజ్ఞ జేసియుంటిని. అందువలన దల్లీ! మీయీదానమును నే స్వీకరింపజాలను."

భాగీరథి నవ్వుచు నిటులనియె "వారి యాంతరికాభిప్రాయమితరు లెట్లు తెలిసికొనగలరు? ఏది యెటులున్నను నేనువారి యభిలషితమును సఫల మొనర్పవలసినదానను గదా! మరియు నందువలననే, మరియు నాకారణమువలననే నేను నిన్నింతగ బతిమాలుకొనుచుంటిని. అటులగానిచో నీకొఱకింత యొనర్పవలసిన యవసరము నాకేమి కలిగినది. నీవు నా కెవ్వరవు?"

అమ్మా! మీరు నా కాశీర్వాదము మాత్ర మొసంగుడు. అంతియ చాలును. మీ యాశీర్వాద ప్రభావమువలన నొక్క వత్సరములోపలనే నేను దశసహస్రరూప్యము లార్జించి దెచ్చెదను."

"సరియేకాని యయ్యాశీర్వాదము కేవలవాక్కులతో మాత్రమే యొసగి స్వస్థముగ నుండు టంత సరియని నాకు గన్పట్టదు. అందువలననే యీకొద్ది తొడవుల నీకొసంగి నేను నీకు సంపూర్ణాశీర్వాద మొనర్చ—"

"తల్లీ క్షమింపుము."

నా యీ యనంగీకార ప్రత్యుత్తరమువలన భాగీరథీబాయి ముఖ మత్యంత ఖిన్నమగుట నేకాంచితిని. చాలసేపామె యా కసమువంక దృష్టి సారించి నిశ్చలముగ నిలుచుండెను. ఆమె నాకొఱకు దేవతాప్రార్థన మొనర్చుచున్నదాయేమి! కొంత తడవున కామె మెల్లమెల్లగ నటనుండి వెడలిపోవుచుండెను— వెంటనే నే నిటులంటిని "అమ్మా! నీతో వచించుటకు లజ్జ వొడముచున్నది—కాని యీ సమయమున నాకొక్కయుప కారము—"

"నేను నీ కిక నెట్టి యుపకారమును జేయబోను." ఇటుల బల్కి భాగీరథీబాయి తొందరతొందరగ యటనుండి వెడల పోయెను. నేనుకొంతతడవేమో మనసున యోచింపుచుంటిని. ఆయోచనయందు నేను మగ్నుడనై యుంటిని. స్వల్పకాలము నేను స్మృతివిహీనుడ నై తిననికూడ యెందులకు వచింప గూడదు? కాని యింతలో భాగీరథీబాయి యెవ్వరినో లాగి కొనుచు నేనున్నకడకు దీసికొనివచ్చుట నాకన్నులబడినంత నాకు స్మృతివచ్చినిది. భాగీరథీబాయి యట్లీడ్చుకొని వచ్చిన యావ్యక్తి నచట విడిచిపెట్టి వెంటనే యంతర్హితయయ్యెను.

నేను విస్మితుడనై చూచునప్పటికి యమున నాకెదుటనిలువబడియుండెను. నేను మనసున నిట్లుదలచితిని. "భాగీరథీబాయి యెవ్వరోయొక యంతర్యామి దేవతయై యుండదుకద!"

భాగీరథీబాయి నిజముగ దేవియే! ఆసమయ మాహ్లాదదాయకమును మనఃప్రసన్నమును నైనందున మాటిమాటికి భాగీరథీబాయియొనర్చిన యాకృత్యమువలన నేధన్యుడనైనట్లు దలంప సాగితిని. ఇప్పుడు నా సమక్షమున యమున— కాదు ప్రత్యక్షలజ్జాదేవి నిలుచునియున్నదే! ఆసమయమున యమున లజ్జాక్రాంతయై శిరమువంచి నా యెదుట నిలువబడియుండెను. ఆమె నా సమక్షమునకు రాకపూర్వ మామెతో నేనెన్నెన్నో విషయముల ముచ్చటింపవలయునని కొండంతాశతోనుంటిని. కాని యిప్పట్టున నానోటనుండి యొక్కపలుకైన వెలువడదయ్యెను. నాహృదయమునందొకవిధమగు చమత్కారికభావ ముదితము కాసాగెను. మరియు దాని యావేగ మతి ప్రబలమై యొక్క నిశ్వాసరూపమున నదిబయలుపడెను. ఇంక నేను స్వస్థముగ నుండలేకబోతిని. నేను మూకరోదన మారంభించితిని. చాలసేపటివరకు కశ్రువర్షము గురిపించితిని. అశ్రువేగ మినుమంతయడగి, నేత్రములకు వీక్షణాశక్తి కలిగిన పిమ్మట నేను చోరదృష్టిని యమునవంక జూచితిని. అప్పుడు లజ్జాభరమ్మున నానతవదనయై నిలుచునియున్న యమున యింతవరకటులనే నిలుచుని యుండెను. కాని యేమి యీయాశ్చర్యము! ఆమె నునుచెక్కులపై నవిరళాశ్రువాహినులు

ప్రవహించుచున్న వేటికి? ఏమి, యమున శోకించుచున్నదా? నన్నేవగించుకొనుచున్నదా యేమి! మనసు చిక్కబట్టి స్వహస్తమున నామె కన్నుల దుడిచితిని. ఆమెతో నిట్లంటిని. "యమునా! నే నీదినమున పరదేశమున కేగుచుంటిని. దశసహస్రరూప్యముల సంపాదింప గలిగినచో నొక్క వత్సరమునకు మనకు బునర్దర్శనమగును. లేనిచో నిదియే మనతుదిదర్శన—"

ఇటులనుచుండగనే నాకంఠమురుద్ధమయ్యెను. నాయీస్థితి గాంచి యమునకూడ మిగుల విహ్వలయయ్యెను. ఆమెయొక్క యాకరుణాజనకస్థితి వీక్షించి నేను మరల స్మృతియుతుడనై హృదయము దృఢము జేసికొని యిట్లంటిని. "ఒక వత్సరము లోపల నేను పదివేలరూకల నార్జించి తెచ్చినయెడల నిన్ను నాకిచ్చి వివాహ మొనర్తునని నానారావుగారు వాగ్దత్తమొనర్చియుండిరి. ఒక సంవత్సరములోపల నింతటిద్రవ్యము సంపాదించుటకు నాప్రస్తుత సామర్థ్యమున నశక్యమైయుండుట నిశ్చయమే. కాని నీనోటనుండి యొకటియ్యాని పలు కాలింప గలిగితి నేని నీయసంభవనీయవిషయ మొకవేళ సంభవమైన గానవచ్చును. యమునా! ఈవివాహమువలన నీకు సౌఖ్యముకలుగునా?"

యమున యించుక స్థిరచిత్తయైనటుల కానవచ్చెదది సత్యమే కాని నాప్రశ్నమునకుమాత్రమేమియు బ్రత్యుత్తరమొసగలేదు. నేనాతురమున నామె మోమువంకజూచి యాదరమున దిరిగి యిట్లు ప్రశ్నించితిని. "యమునా! నాప్రశ్నకు బ్రత్యుత్తర మొసగవేల?"

మిగుల కష్టముమీద యమునయొక్క మూరు మాటలాడెను. కాని నాప్రశ్నకుత్తరమొసగక తిరిగి యామెనన్నిటుల బ్రశ్నించెను. "ఏమి, పదివేల రూప్యములా? ఈపదివేలరూప్యములెందులకు?"

"నీకొరకే యమునా. నానారావుగారింకను పదివేలరొక్కమును నీవివాహకాలమున నీకరణమొసగ సమకట్టియుండిరి."

యమున పైటచెరగుచే గన్నుల నొత్తుకొనుచు మందస్వరమున నిట్లనియె "నాకుధనమగత్యములేదు—మీరు—"

యముననోట తరువాతిశబ్దము వెలువడదయ్యెను. ఆమె సుందరవిశాలనేత్రయుగ్మము మౌక్తికబిందు సంయుక్తమయ్యెను. ఆమెమననుసందుగల ముందటియాశయ మీయశ్రుబిందువులే సంపూర్ణమొనర్చెను."

రుద్ధకంఠుడనైన నేనామె నూరడింపుచు నిటులబల్కితిని "యమునా! నీవు దుఃఖింపకుము. నీసోదరుడు కేవలము నీ కళ్యాణముకొఱకే యిట్లొనర్చుచుండెను. నేను సర్వవిధముల దరిద్రుడను. నావంటి బీదవానికి నిన్నాతడెటు లొసంగగలడు? నాకిప్పుడిచ్చట విశేషకాలము నిలచుటకు వ్యవధిలేదు. ఒక్కొక్కక్షణము నాకతిమూల్యమై యున్నది."

యమున మరల మిగుల కష్టమున నిట్లనియెను "తిరిగి యెప్పుడువత్తురు;"

నేను దక్షణమే బ్రత్యుత్తరమొసగితిని 'ఎంతత్వరితముగ రావలను పడునో యంతత్వరితముగ వచ్చెదను. ఏగడియ

యందు దశసహస్రరూప్యములు కరగతమగునో యాగడియ యందే బయలుదేరి వచ్చెదను."

ఇంతదనుక యమునతలవాంచి నిలుచునియుండెను. ఇప్పు డామెశిరముపై కెత్తి నన్నొకమారు స్థిరదృష్టివీక్షించెను. ఈ సమయమున ననిర్వచనీయమును, శబ్దశూన్యమునునగు మూక భావతో నామె నాతో నెన్నియోవిషయములు వచించెను. అవియెల్ల నేను తెలసికొంటిని. నాసర్వాంగములయందును నాసమయమున విద్యుత్ప్రవాహము ప్రవహింపసాగెను. నేనే మియు స్వస్థముగ నుండజాలకపోతిని. తక్షణమిటులంటిని "యమునా! నీవు నాదానవయ్యెదవా వచింపుము? నీనోటి వెంట నియ్యది యాలకించినచో నేను సమస్తసంకటములను తృణప్రాయముగ భావింతును. వచింపుము. యమునా నీవు నాదానవ—నాదానవగుదువా?"

యమున యొక్క లేతీరున నశ్రువర్ష ముగురిపింపుచు నస్పష్ట వాక్కుల నిటుల బ్రత్యుత్తరమొసంగెను "నేను మీదాననే. ఎంతకాలముమీశరీరమున బ్రాణములుండునో—అంత కాలము నేను మీదాననే!"

యమున నేత్రద్వయమునుండి యవిరళాశ్రు ధారలు ప్రవ హింపసాగెను. ఇంతలో భాగీరథి బిగ్గరగ కేకవైచెను "యమూ!"

యమున లజ్జాభరమ్మున దొట్రుబడుచు రయమునసటనుండి వెడలిపోయెను. నేనో, జడమూఢుడనైపోయి తదేకదృష్టితో నామెదెస వీక్షింపసాగితిని.

ఆదినము సాయంకాలమున నేనంపరివద్దను సెలవుగైకొని దేశాంతరమునకు బయలుదేరితిని. ఇంతటితోంచరగ సెలవొసంగుటకు భాగీరథీ నానారావు లనుమతింపలేదు. కాని యిప్పుడొక్కక్షణముగూడ వృధావ్యయము సేయగూడదని నేనెంతయు దృఢనిశ్చయ మొనర్చుకొనియుండుటవలన వారిప్రయత్నమేమియు సాగినదికాదు. దేశాంతరమున కరుగుటకు నేను కృతసంకల్పుడనై యున్నందున నే నేగృహమున నింతవరకు బాల్యావస్థనుండియు నివసించుచుంటినో యాయింటనుండి బయటకడుగిడుటకు నాకంతకష్టముగ నుండలేదు. కాని గ్రామమువిడిచి యైదారుక్రోశములదూర మేగునప్పటికి నామనసున నట్టికరుణాస్పదస్థిత్యంతరమేదో ప్రారంభమయ్యెను. ముందునకడుగు సాగదయ్యెను. నలుగడల నంధకార మాక్రమించియుండెను. సర్వాశుభములు దోచుచుండెను. నాహృదయాంతరమున మాటిమాటికి యిటుల ధ్వనియగుచుండెను. "గంగాధరా! యమునను విడిచి నీవెటకేగుచుంటివి?"

వెంటనే యమున వచించిన తుది వాక్యములు నావీనులకు వినవచ్చెను. ఆవెంటనే మరల బూర్ణోత్సాహమున వడివడి నేను ప్రయాణమొనర్పసాగితిని. మానవసాధ్యమగునేని యది యెంతటిదుర్ఘటకార్యమైనను నావలన దప్పక నెరవేరగలదని నాదృఢవిశ్వాసము. ఏమి? మనుష్యునకొక్క వర్షాంతరమున

దశసహస్రరూప్యము లార్జించుట దుస్సాధ్యమా? పరమేశ్వరుని కృపయుండినచో వత్సరమననేల. ఆరు — కాదు ఒక్కమాసము దినముల లోపలనే పదివేలరూకల సంపాదింపగలడే? ఆలోక రక్షకుడు నాపై గృపాదృష్టినుంపడా? నే ననన్యభావమున సమ్మహనీయుని యారాధింతును. మనోవాక్కాయ కర్మల బలవత్తర ప్రయత్నమొనర్చెదను. అప్పటికినినాకు సంకల్పసిద్ధి కాకుండునా? తప్పక నాకిందు జయముఘటించితీరును! ఇటుల మనసున ఘూర్ణోత్సాహుడనై యాదయామయ ప్రభుని స్మరింపు వాయువేగమున నేను ముందుకు నడచితిని.

కాని, ఏగుటెచ్చటికి? తక్షణమే యీయూహ నామనసును పకు దట్టెను. ఈసమయమున సాక్షాద్దేవియగు నాభాగీరథీమూర్తి నాకట్టెదుటవచ్చినిలచెను. మరియు నామెవాక్కులు నాకు మార్గదర్శితములయ్యెను. భాగీరథీబాయి బొంబాయి నామమే గదానాతో నిదివర కుచ్చరించియుండెను? ఆదేవి యాజ్ఞయె శిరసా వంద్యముగ గైకొని నేను బొంబాయికరుగ స్థిరసంకల్పుడ నైతిని.

మాగ్రామమునుండి బొంబాయి సుమారు నూటయేబది క్రోశముల దూరముండెను. మాయూరనుండి ముప్పదిక్రోశ ములు కాలిబాటవెంట నేగినచో రైలుస్టేషను జేరుదుము. కాని నేనాస్టేషనునకేగు రాజమార్గమున నేగక నచ్చముగ కాలిబాటను నడచిపోవుచుంటిని. కారణ మేమన నేనుమిక్కిలి నిరుపేదను. ధనశూన్యుడను. ఇదియునుగాక ద్రవ్యార్జన నిమి

త్తమున నే యిల్లువిడిచి పరదేశముల కరుగుచుంటిని. అటు లగుట నేకార్యము శరీరకష్టమువలన నెరవేరునో యదినాకడ ద్రవ్యముండియున్నను నందులో స్వల్పమాత్రమైన—నేనెందు లకు వెచ్చింపవలయును? నాకు మాత్రము నాశరీరమందలి రక్తముకంటె నొక్కపైసకూడ నతిమూల్యముగ గన్పట్టు చుండెను. అటులగుటనేను రైలుమీద బ్రయాణమొనర్తునా? ఆరైలు టిక్కెట్టునకగు పైకముగూడ నేనార్జింపవలసిన మొత్త మున జేర్చినచో కొంతభారము తగ్గునుకద! ఇటుల మనసున యోచింపుచు నేను వడివడి నడచుచుంటిని. ఇంతలోన స్తమాన మయ్యెను. నలువంకల గాఢాంధకార మలమికొనియెను. మార్గమున బధికులసందడికూడ క్రమక్రమముగ మందమగు చుండెను. ఎల్లెడల నిశ్శబ్దము వ్యాప్తమయ్యెను. అయినప్పటికిని నేనణుమాత్రమును భయమందక నాకటికి చీకటియందే మిగుల వేగమున నడచిపోవుచుంటిని. ఏకార్యమునకై నేను ప్రతినయొనర్చి యిల్లువెడలితినో యాకార్యము ముందు ప్రపం చమునగల యెట్టిభయమైనను నాకు దృణప్రాయముగ నుండెను. మరియు నారాత్రి యరణ్యమందలి వ్యాఘ్రాది భయంకరవన్య మృగముల గర్భనిర్భేదక ధ్వనులకుగూడ నే నిసుమంతయు భీతిల్లలేదు. పాపమా వన్యమృగములు నన్ను భయపెట్టుటకు గాబోలు నొక్కటేవిధమున నఱచుచున్నవి. కాని నే నెట్టి ధీరుడను! అవియేమియు లెక్కగొనక నొక్కటే విధముగ నడచిపోవుచుంటిని. మార్గాయాస మావంతయు నాకుదోచుట

లేదు. కాదు. నాశరీరమున నసమానవిస్ఫురణము వ్యాపించి యున్నది. ఆసమయమున నా శారీరికబలముకన్న మానసిక బలమే బలిష్ఠమై పోయెను.

జఠరాగ్నిశమన మొనర్చుకొనుటకై యొకటి రెండుగడియలును, నిద్రనిమిత్తమై కొంతకాలమును మాత్రముదప్ప దక్కిన కాలమందు లవలేశమైన విశ్రాంతిగొనక హుటాహుటిగ నడచి పదునాల్గు దివసములందందు మజిలీలొనర్చుచు తుదకు బొంబాయిపట్టణమునకు వచ్చిచేరితిని. బొంబాయి యిహలోక స్వర్గపురియని నేనింతవరకు కేవలము వినియుంటిని. ప్రత్యక్షముగ నిప్పుడు బొంబాయిపట్టణము దర్శింపగనే నాకపరిమితానందము కలుగవలసియుండెను. ఆగగనచుంబిత సౌధరాజములును, మోటారు, ట్రాం, అశ్వశకటములు మొదలగువానిచేతను, భవ్యశాలురగు ప్రజలచేతను గ్రిక్కిరిసియున్న విశాలపణ్యవీధులునుమరియునింక నితరభవ్యవిషయములును నాకుసంతోషదాయకములు కావలసినదే! కాని యవియేమియునాకుగోచరించుటలేదు. కారణమేమన నామనసు నావద్దనెక్కడనున్నది?అది తన యిష్టోద్దేశము వైపున మగ్నమైపోయియుండెను. అది యెయ్యెడ కీడ్చుకొని పోవుచుండెనో నేనయ్యెడకు బోవుచుంటిని. నాకు గన్నులుండియు గాంచనేరనైతిని. చెవులుండియు విననేరనైతిని. నోరుండియు మాటలాడజాలనైతిని. మరియు నాలోచనాశక్తియుండియు నాలోచింపలేనైతిని. నేను వట్టి పిచ్చివాడనైపోతిని. నేనవ్విధమున ముందే పిచ్చివాడనై యుంటిని.

బొంబాయి యింతకుముందెప్పుడును నేనువచ్చియుండలేదు. ఇది యునుగాక నాకిచ్చట పరిచితులెవ్వరెను గూడలేరు. అపరిచితుడను, అనాశ్రితుడను, నగునే నీమహాపట్టణమున వచ్చిపడితిని. నేనున్మాదునివలె నీవీధినుండి యావీధికిని, యావీధినుండి యీవీధికిని, ఈవైపునుండి యావైపునకును ద్రిమ్మరుచుంటిని. నడుమనడుమ నేనివ్విధమున కాలమును దురుపయోగ మొనర్చుచుంటి నని మనమున బశ్చాత్తాపమొందుచుంటిని. ఒక్క వత్సరము లోపల బదివేలరూకలు నేనార్జింప వలసియుండెను. అబ్బా! ఎంతపెద్దమొత్తము! ఈద్రవ్యసంపాదన విషయము తప్ప నామనసున కేమియు స్ఫురించుటలేదు. కాని యీదశసహస్రరూప్యములార్జించుటకుముందెచ్చటనైన నాకాశ్రయముదొరక వలెనను తలం పిసుమంతకూడ నామనసునకు బొడగట్టదయ్యెను. మధ్యాహ్నము పండ్రెండు ఘంటల పర్యంతము నేనవ్విధమున భ్రష్టుని చందమున గ్రుమ్మరుచుంటిని. నన్ను జూచి యెవ్వరు నొక్కరుగూడ పలుకరింపలేదు. నేనుగూడ నెవ్వరిని నేమియు బలుకరింపలేదు.

## ౨

దినమెటుల గడచిపోవుచుండెనో నామనోవిచారము గూడ నటులే గడచిపోవుచుండెను. నామనసున కిప్పుడిటులతోచుచుండెను. ప్రప్రథమమున నిచట నేనెవరినైన బరిచయము

చేసికొను టత్యావశ్యకము. కాని నేనెవ్వరినైన నెటుల బరిచయమొనర్చుకొందును? అకస్మాత్తుగ, ననవసరముగ నేనెవ్వరినైన నెటుల బలుకరింతును? నేనాలోచనసముద్రమున బడితిని. ఇందుల కేమి యుక్తి యోచింపవలయునో నాకెంత యోచించినను సూచించుటలేదు. క్షుధాతృష్ణాదికములుగూడ నాకేమియు స్ఫురించుటలేదు. నేనెవరి చెంతకేగి యాశ్రయమడుగుదును! హాయద్వయశకటములయందు సుగంధ ద్రవ్యభూయిష్టములగు దుస్తులధరించి వేనవేలుజనుల వీధులవెంట వచ్చుచు బోవుచుండిరి. కాని యీబీదవాని జోలి యెవనికి గావలయును.? మాపల్లెటూళ్ళను మీరిచ్చు వచ్చినటుల నిందింపుడు. కాని యచట నెన్నడు నిటుల జరుగదు. ఎవ్వరైన నపరిచితగృహస్థుడు గ్రామమున బ్రవేశింపగనే మా గ్రామవాసులు ప్రశ్నాపరంపరలచే వానిని విచారింతురు. మరియు వాని కాదరసత్కారము లొనర్చి మనస్ఫూర్తిగ భోజనాదికముల గూర్తురు. కాని బొంబాయి పట్టణము యొక్క యీచమత్కారికరీతి నాకెరుకలేదు. ఇంతటి మహాపట్టణము, ఇంతటి సంపన్నులు— ఇంతటి వైభవశాలురునగు ప్రజలు నాయట్టి నిరాశ్రితుని, అపరిచితుని నెవ్వరు గూడ బరామర్శింపరేలనో!

ఎవ్వరు నన్ను క్రీకంటనైన జూచుటలేదు. మరి నేనాగంతుకుడనని యెవ్వరి కెరిగించుకొందును? నే నతిదీనుడనగుట నిజము. కాని యింతవరకెన్నడును నెవ్వరిని ముఖస్తుతి

లొనర్చియుండినటుల నాకు జ్ఞాపకములేదు. సరే నే నొక ఘడియకాలము మానాభిమానములు, లజ్జ, కులీనత నివి యెల్ల నొక మూలకు ద్రోసివుచ్చుటకు గూడ నొప్పుకొం టిని. కాని యెవరును నన్నొరక నొక్కపలుకైన బలుకరింప కున్నచో మరియేరివద్దనైన నే నెటు లీవిషయమును ప్రస్తా పింతును? మాగ్రామమున నెట్టి సుఖవస్తు గృహస్థులనైన గానిండు. ఎవ్వరైన బరదేశీయు డూరబ్రవేశించి యాతడువ వాసముగాని, ఇంక సముచిత సాహాయ్యముగాని బడయకుండ మరలినవాడు లేడు. అటులయ్యు నిచట ననేక వేల సంపన్న గృహస్థులుండి యుండియు నాయట్టి యొకానొక యపరిచిత వ్యక్తికి భోజనసదుపాయముగాని, మరియెట్టి పరామర్శగాని లభింపకపోయెనే! ఓబొంబాయి నగరమా! నీకొక నమ స్కారము!

రెండుజాములు దాటి సాయంకాలమయ్యెను. అప్పటికిని యదే విధము. ఇప్పుడు మాత్రము నేను మిక్కిలి యధీరుడ నైపోతిని. నా కేమియు సూచించుటలేదు. వీధివెంట జను చున్న యొక గుజరాతీ గృహస్థుని మిగుల గష్టముతో నేని ట్లడిగితిని. "ఇచట యెచ్చటనైన నన్నసత్రమున్నచో దయయుంచి నాకెఱింగించెదరా?"

నావంక వీక్షించి యాగృహస్థు డించుక నవ్వి యిటు లనియె "మీరొక మంచి సభ్యగృహస్థునివలె గన్పట్టు చున్నారు. మీవంటి గృహస్థు కొఱ కిచట నన్నసత్ర

మున్నటుల నాకెఱుక లేదు."

ఆతని యీప్రత్యుత్తర మాలకించి నేను మిన్నకుంటిని. చాలతడ వాతడు నా మొగమువంక వీక్షించి తిరిగి యిట్లనియె. "మీ రేయుద్దేశమున నీపురమునకు వచ్చియుండిరి?"

ఈప్రశ్నమునకు నే నేమి ప్రత్యుత్తర మొసగుదును! నేను కొంచెము సేపు స్తబ్ధముగ నుండి పిమ్మట నిట్లంటిని "ఏదేని కుక్షింభరణోపాయమరయుటకై యిటకు వచ్చి యుంటిని."

"ఇచట మీ కెఱుక గల వారెవ్వరును లేరా?"

"ఎవ్వరును లేరు."

"అటులైన మీ రొక భోజనవసతి గృహమున కరిగియుట మంచి యొనర్పుడు."

"పూటకూటి యింట నిచ్చుటకు నావద్ద ధనమేమియు లేదు."

ఆసభ్యగృహస్థు నా మొగమువంక దృష్టి నిగుడించి చూచు చుండెను. ఆతడు మరల నిటులనియెను. "మీ రెంతవరకు జదివి యుంటిరి?"

"రెండు వత్సరములకు బూర్వము నేను మెట్రిక్యులేషన్ పరీక్షప్యానయి——"

"సరియే, మీరు నాతో నడువుడు. నేను మీ భోజనపానాది సమస్తవ్యవస్థల నొనర్చెదను. నాయింట బాఠశాల కేగు నిరువురు పిల్లలుండియున్నారు. వారికి గృహమున నొకటి రెండు

గంటలు విద్యాభ్యాసమొనర్చుటకు మీవంటివారి నెవరినైన నేర్పాటు చేయవలయునని నేను చాలాదినములనుండి యాలోచింపుచుంటిని. అదృష్టవశమున నీదినమున మీరుకనిపించితిరి. మీకును నిప్పట్టున నిట్టి సదుపాయము కుదురుట యవసరమేమైయుండెను. మరియు నాకుగూడ ననాయాసముగ గార్యసానుకూలమగుచున్నది. ఈనాపలుకులు మీకు దృప్తికరముగ నుండెనేని నాతోడ మాగృహమునకు రండు."

"మీరు నాకిచట భగవద్రూపమున సాక్షాత్కరించితిరని నే భావింపుచుంటిని."

ఇటులబల్కి నే నాయుదార గృహస్థునియడల గృతజ్ఞత సూచింపుచు నాతనివెంట వారి గృహంబున కరిగితిని.

అపరిచితుడను, అనాధుడనునగు నా కాశ్రయ మొసగిన యయ్యుదార స్వభావ గృహస్థుడగు దయాళసేటుజీ యాతని పేరునకు దగినటుల నిజముగ నతిదయాళుడై యుండెను. నే నొక సామాన్యమానవుడను. అందునను నిరాధారుడను, నిరాశ్రితుడను, మరియు మిగుల నపరిచితుడను. కాని దయాళసేటుజీ నన్నుగాంచిన దినముననే నాకింతటి యాద రాతిథ్యమొసగెను. మరియు నావిషయమున నింతటిప్రేమ భావముగనబరచెను. పరమేశ్వరుడునాకు మరియొకగృహ మొసగినాడని నే భావించితిని. మరియు నేనన్యభావమున నీశ్వరుని బ్రార్థనమొనర్చితిని. నలుచదరమగు నొకచిన్న సుందరమందిరమందు దయాళసేట్జీ సుశీలయగు నిజభార్యాసహితుడై మిగుల నానందమున

నివసింపుచుండెను. ఈశ్వరు డప్పుడప్పుడిట్టి పుణ్యాచారిత్రుల దాంపత్యబంధమున ననుసంధాన మొనర్చుచుండును. ఆ మహ నీయుని సంఘటనము గాంచినంత యదార్థముగ నా వర్ణనీయ సుఖసంధానమయ్యెను. పూర్వజన్మార్జితసుకృతమువలననె యిట్టి స్త్రీపురుషులొక్కచో ననుసంధానమయ్యెదరు. ఈవిషయము నిర్వివాదము. మరియు నట్టిపూర్వజన్మసుకృత మొనర్చినవారిలో మనదయాళ సేట్జీ యొకడై యుండెను. ధనకువర్ బాయికూడ తొలిజన్మమున మహాసుకృత మొనర్చియుండెను. అందువలననే యామె నాకాశ్రయదాతయగు దయాళసేటుజీవంటి సజ్జనపతి లాభమువడసినది. ఈ విషయము యదార్థయుమైన్నది, కాని ధనకువర్ బాయికంటెగూడ దయాళసేట్జీయొక్క పూర్వసుకృతి యత్యధికమైయుండెను. ఈ విషయముగూడ నటులే నిర్వివాద మైయుండెను. ఆహాహా! ఆసాధ్వీమతల్లి యశమును నే నెంతని కొనియాడుదును? దయాళసేట్జీయొక్క సుకృతములవలన సంతుష్టుడగుటచే గాబోలు విధాత యాతనికీసర్వసద్గుణఖనియగు సతీరత్నమును నొసగియున్నాడు. దయ, పరోపకారము, ఇతరులకు యథాశక్తి సహాయ మొనర్చునట్టి యుత్కంటలలాన, ఇతరులు సౌఖ్యమందుటగాంచి తాను సుఖమందుట మొదలగు సద్గుణములందా సతీపతు లొకరినొకరు మీరియుండిరి—కాదు దయాళసేటుజీ కన్న ధనకువర్ బాయి దయాస్వభావ మిసుమంత యధికమై యుండెనని వచించుటకు నాకెట్టి సందేహమును లేదు. పతిపత్నుల యీ దివ్యగుణగణములకు లబ్ధుడై

పోయి యీపరమకృపాళుడు శ్రీమన్నారాయణుడు వారికి మణి, మోహనయను నపత్యరత్నద్వయమును కాన్కనొసగి యుండెను. మణి పదివత్సరముల బాలిక మోహను డష్టవర్ష వయస్కుడు. మాతాపితరుల సమస్తగుణగణములు బాల్యము ననే నా సంతాన ద్వయమునందు స్పష్టముగ దృగ్గోచరమగు చుండెను. ప్రపంచమునం దెచ్చటనైన రామణీయకము, సుఖ ధామమునుండి యుండినచో నయ్యది మాదయాళ సేట్జీగృహ మునసే గలదు. ఈ రమ్యధామమున నాశ్రయము దొరకుటచే నావ్యగ్రమానసమునకు గూడ వర్ణనీయశాంతి లాభము సం ప్రాప్తమై క్షణకాలము నేను నామనోవ్యథ మరచిపోయి దయాళసేటుజీయొక్క యీ రమ్యపరివారమునందే తల్లీనుడనై పోతిని.

దయాళసేటుజీ తన ముద్దుబిడ్డల మణిమోహనుల శిక్షణ భారము నాపై నునుపగనే నే నాకార్యము మిగుల నాసక్తితో నతిశ్రద్ధతో నాచరించుచుంటిని. ఈ సద్గుణబాలికా బాలకు లేగాక వారి తలిదండ్రులుకూడ నాపై మిగుల బ్రేముడి గల వారై యుండిరి. మరియు వారు తమ ప్రకృతికృత్యమునం దును, ప్రతి వాక్యమునందును నయ్యది వ్యక్త మొనర్చుచుం డిరి. నాయీ యుపకారకర్తల ప్రసన్నభావము గాంచినంత నాకును మిగుల సమాధానము కలుగుచుండెను. నాబోధనా పద్ధతులును, పిల్లలపై నాకుగల యపారప్రేమమునుగాంచి దయాళసేట్జీ నాభోజనాది యితర సమస్తవ్యవస్తల నేర్పాటు

జేయుటయేగాక నాకు ప్రతిమాసమునకు పదునైదు రూప్యములచేతన మొసగుసటుల వాగ్దత్త మొనర్చెను. నేను కృతజ్ఞతా పూర్వకముగ నద్దానిని స్వీకరించి నాకార్యము నేనమిగుల శ్రద్ధతో నెరవేర్చుచుంటిని. ఈ విధమున నొకమాసము దినములు గడచిపోయెను.

౨

కాని యీపదునైదురూప్యములతో నా కేమగును! ఒక్క వత్సరములోపల నేను పదివేలరూప్యముల సంపాదింపవలసియుండెనే! మరియు నాదశసహస్రరూప్యము లార్జించుటకొఱకే నేను స్వస్థానమును, ప్రాణమిత్రులనువీడి బొంబాయికి వచ్చియుంటిని. ఆ పదివేలరూకల నెటులగూర్తునాయను విచారము రాత్రిందివము లిప్పుడు నన్ను వేధింపుచుండెను. దయాళనేటుజీతో నాకిప్పు డత్యధికపరిచయము కలిగినది. ఇదియునుగాక యిప్పుడాతనితో మనసువిడచి ప్రసంగించుటకును, నా కష్టసుఖము లాతనిచెవిని బడవేయుటకును నా కెట్టి సంకోచమును గలుగుచుండుటలేదు—కాదు, ఆతనికే నాసుఖదుఃఖముల నివేదనమొనర్చుకొన్నచో నాతడే తప్పక నే దేనొక తరుణోపాయమును జూపించుననను నాలోచనమిప్పుడు నామనసునకు దోచినది. చాలదూరము యోచించి యాతనికే విన్న

వించుకొనవలెనని నామనస్సున నిశ్చయించుకొంటిని. ఒక దినము భోజనాంతరమున నాతడు దివాణఖానాయందొంట రిగ గూర్చునియుండెను. నే నాతనిడాసి యిట్లంటిని. "సేట్జీ మీరు నా కనేకోపకారములొనర్చి యుంటిరి. పుత్రవాత్సల్య మున నన్ను బ్రేమించుచుంటిరి. మణి నాసోదరియనియు, మోహనుడు నాసోదరుడనియు నేను భావించుచుంటిని. ఎంత పర్యంతము నేను బొంబాయియందుందునో యంతపర్యంతము వారికి శ్రద్ధాపూర్వకముగ గష్టించి విద్యగఱపుదును. కాని మీరు నా దారిద్ర్యమును విచారించి మీకు పరిచితమగుచోట నెచటనైన నాకొక యుద్యోగముసంపాదించి పెట్టుడు. మీ కెంతయో పున్నెముండును. నేను మీ యుపకార మాజన్మాం తము మరచిపోను—"

ఈ నామనవి దయాళసేట్జీ యంగీకరించినట్లే గన్పట్టెను. కించిత్కాలమాతడు స్తబ్ధుడై యుండెను. అనంతర మాత డిట్లనియెను "ప్రస్తుతకాలమున నీబొంబాయియం దుద్యోగము దొరకుట మిగుల దుస్తరముగ నున్నది. ఈ విషయము మీ రనుకొనినంత సులభసాధ్యముగ గన్పట్టదు. అయినను—"

దయాళసేట్జీ నోటనుండి వెలువడిన యీనిరాశాసూచక వాక్యములాలకించినంతనే చప్పున నా కాలుసేతులు చల్లబడి యెను. మోము వెలవెలబోయెను. నేత్రములశ్రుపూరితము లయ్యెను. నేనేమియు బలుకక దలవంచి నేలజూచుచు స్వస్థ ముగ గూరుచుంటిని. నాయీయాకస్మిక కరుణాస్పదస్థితి

గాంచి దయాళశేట్జీకూడ చింతాక్రాంతుడయ్యెను. ఆతనినయన యుగ్మమునుండికూడ నొకటిరెండు బాష్పబిందువులురాలెను. ఆతడు సప్రేమముగ నిట్లనియె "నీగృహమున స్వజనమెందఱు గలరు ?"

నా కిప్పుడు మిగుల దుఃఖమువచ్చెను. నేను గద్గదకంఠుడనై కరుణాస్వరమున నిటుల బ్రత్యుత్తరమొసగితిని. "నాకిల్లులేదు. వాకిలిలేదు. భార్యలేదు. ఈ ప్రపంచమున నావారని చెప్పికొనుట కెవ్వరునులేరు."

ఈ నానుడువులాలించినంతనే దయాళశేట్జీవిస్మితుడై యిట్లనియె "మరి యుద్యోగముకొఱకు నీవింతటి యాపన్నుడవై యుంటివేటికి ?"

ఈ ప్రశ్నమునకు నేనేమని ప్రత్యుత్తరమొసగవలయునో నాకేమియు స్ఫురింపలేదు. అందువలన గేవలమౌనముద్రావలంబినై యూరకుంటిని. దయాళశేట్జీయే మరల నిటులనియెను "మీకు ఋణములు మొదలగు బాధలేమైననున్నవా"

"లేదు నాకట్టిబాధలేమియు విసుమంతగూడలేవు. కాని యొక్కవత్సరములోపల నేను పదివేలరూప్యముల సంపాదింపవలసియున్నది. ఒక్కవర్షాంతరమున దశసహస్రరూప్యములార్జింతునని ప్రతిజ్ఞనొనర్చి నేనిల్లువెడలితిని. ఈపదివేలరూకలు నాకు బ్రాప్తించినగాని నేను మరల స్వస్థానమునకేగి యచటవారికి మొగముజూపను. ఎటులైన దుర్ఘటప్రయత్నమొనర్చి యీరొక్కము సంపాదింప నే నిశ్చయించుకొంటిని. ఈప్రయ

త్నమునందు నాకు దేహావసానము సంభవమైనను నేను మహా నందముగ భావించి సుఖనయ్యెద" నని మిగుల నావేశమున నంటిని.

నా యొక్క యీ యావేశపూరితములును, కృతనిశ్చితములును నగు భాషణములాలకించి దయాళసేటాశ్చర్యచకితుడై తదేకదృష్టి నా మొగమువంక వీక్షింపసాగెను. చాలసేపటివఱకాతని నోటివెంట నొక్కపలుకుకూడ వెలువడలేదు. కొంత వడికాత డిటులనియె "మీరిట్టి యసంభవనీయ ప్రతిజ్ఞనొనర్చుటకుగల కారణమేమి?"

నేను నిరుత్తరుడనైతిని. ఎటుల బ్రత్యుత్తరమిచ్చుటకును నాకు దోచలేదు. దయాళసేఠే మరల నిటులనియెను "నీ వాక్కుల యావిర్భావమువలనను, మరియు నా వేశమువలనను స్పష్టముగ గానవచ్చుచునే యున్నది. మరియు దాని కారణమే యద్దాని స్వల్పాంశముగూడ బొడగట్టుచునేయున్నది. అయినను నయ్యది నీనోటివెంటనే వినవలయునని నాయిచ్ఛ. నీకేమియు నభ్యంతరము లేనియెడల నీ సమస్తవృత్తాంతము—"

నాకు దుఃఖము పొరలివచ్చెను. గద్గదకంఠుడనై నేనిటులంటిని "ఏదేని యభ్యంతరముండియున్నను నా వృత్తాంతము నేను మీకడ గుప్తముగ నుంచుట భావ్యముకాదు. మీరు నాకు జనకసమానులు. నన్ను బెరవానిగ భావింపక మీరే నా కేదో యోగ్యమగు తరుణోపాయమార్గమును జూపింపగలరు. మీపట్టున నిట్టి విశ్వాసము నాకు దృఢముగ

గలదు.

ఇటుల వచించి నా వృత్తాంత మాద్యోపాంతముగ నేనాత నికి నివేదన మొనర్చితిని. దయాళుసేట్జీ యేకాగ్రచిత్తమున దుడవరకు నాలకించెను. నేను స్వస్థచిత్తుడనైన పిదప నతడు నాతోనిట్లనియె "నిజముగ నానారావు మిమ్మిచటనుండి దూరము సేయుటకే యీయుక్తి బన్నియుండును. మీవంటి పేదవారికి జన్మగలంతకాలము సంపాదించినను నింతటి ద్రవ్య సంచయము సంగ్రహ మొనర్చుట దుస్తరము. అటులగుట నొకసంవత్సరాంతమున ననుమాట దలపనేటికి? ధర్మమువల నను, నీతివలనను, పాపభీరుత్వమువలనను వర్తించి యింతటి ధనము సంపాదింపగలనను ధైర్యము మీకున్నదా? ధర్మ నీతిపథానువర్తియగు మానవుని కీవిషయము బహుదూర మని నా నమ్మకము."

"ధర్మ నీతిపథంబుల నతిక్రమించి నేను ప్రాణాంతసమ యమున గూడ నడుగిడజాలను. శక్యమగునంతవఱకు ప్రయ త్నించెదను. ప్రస్తుత మీ యుపాయము మాత్రము జింతించి తిని. మరియు బ్రాణములనైన లెక్కగొనక నహర్నిశములు ప్రయత్నించి శ్రమ మొనర్చెదను. దయయుంచి నాకేదేని యుద్యోగ మిప్పింపుడు. నాకు జీవదాన మొనర్చిన పుణ్యము మీకు గలుగును."

"కాని యుద్యోగమువలన నీ కేమగును? మహాధికమైన చో బాతిక ముప్పదిరూకల వేతనము లభించును. బొంబాయి

యందలి ఖర్చుమితము. అటులగుట మిగుల జాగ్రత్తగ వాడు కొనినచో వత్సరమున కేరెండువందలో మిగులుట దుస్తరము. ఇదియునుగాక నీరోజులలో బొంబాయియం దుద్యోగముదొరకుట మిగుల దుర్లభముగనున్నది. వర్తకపు కంపెనీల యందలి ఆఫీసు వ్యవహారములయందు పూర్ణపరిచయము కలిగి యుండనిచో నెవరికిని నిలువవలను పడదు. రైల్వే, మ్యూనిసిపాల్టీలయందు వత్సరములకొలది యుమ్మేదువారీ యొనర్పవలయును. ఇక సర్కారీ ఆఫీసుల సంగతిజూడ పెద్ద పెద్ద సిఫార్సులు, గ్రాడ్యుయేటులు కావలయును. నలువంకల ద్వారములు బంధింపబడియున్నవి. మీరు మెట్రిక్ మాత్రమే ప్యాసైయుండిరి. సెక్రెటరీయేటునందు మాబంధుగుడొకడమల్దారీ యుద్యోగమున నున్నవాడు. కావలయునెడ నేనాతనికి యుత్తరము వ్రాసియిత్తును. ఉద్యోగ మొనర్చుటకే మీరు కృతనిశ్చయులై యుండియున్నచో పాపము ప్రయత్నించి చూడుడు."

నేను ప్రార్థించి దయాళసేట్జీవలన నాతని మిత్రునకు సిఫార్సుపత్రమును బుచ్చుకొంటిని. తరువాత మరునాడు వరువాత బయలుదేరి బాళకేశ్వరమున రావుసాహేబు గులాబ్ భాయిగారి బంగాళాకరిగితిని. రావుసాహేబుగారి బంగాళావరండాయం దానమయమున నేడెనమండుగురు జనులు కూర్చునియుండిరి. రావుసాహేబు గారింతవఱకు బడక నుండి లేవనె నలేదు. పదు, యేడున్నర గంటల సుమారున

నాతఁడు నిద్రలేచి ముందు తేసీరు, శౌచముఖమార్జనాది విధులు నిర్వర్తించు నప్పటికి యెనిమిది, యెనిదిమిదిన్నర గంట లగును. వరండాయం దుపవిష్టులై రావుసాహేబుగారి దర్శన మపేక్షించుచున్న యూజనులును నావంటివారే యైయుండిరి. నావలెనే రావుసాహేబుగారికి సిఫార్సుపత్రములు గైకొని వచ్చియుండిరి. ఇయ్యది మాయుభయుల స్వల్పపరిచయ మూలమున శీఘ్రముగనే నాకు దెలియవచ్చినది. ప్రాత ర్విధుల నిర్వర్తించుకొని యెనిమిదిన్నర సుమారునకు రావు సాహేబుగారి దివాన్‌ఖానా ప్రవేశించి యొకరాకింగ్ చైరుపై నాసీనుడై యొకబంట్రోతు ద్వారా మమ్మొక్కరొక్కరుగ లోపలకు బిలిపించిరి. అందరునేగిన మీఁద తుదకు నావంతు వచ్చెను. లోనికేగుటతోడనే రావుసాహేబుగారికి నేను సవిన యముగ నమస్కారమొనరించి దయాళసేట్జీయిచ్చిన యుత్తర మాతని కొసంగితిని. లేఖ చదివికొని నంతట నాత డిటు లనియె "ఉద్యోగము కొఱకెంద రాపన్నులైయుండిరో, యెం దరు సిఫార్సు పత్రముల దెచ్చియుండిరో ప్రత్యక్షముగ మీ రిప్పు డీవచ్చిన జనులనుబట్టి తెలిసికొనియేయుందురు. మీరు కేవలము మెట్రిక్కుమాత్రమే ప్యాసయియుండిరి. కాని బి.యే.పరీక్ష ప్యాసైన కొందరుగ్రాడ్యుయేట్సుకూడ మాఆఫీసు నందిప్పు డుమేదువారీజేయుచుండిరి. అయిననుమిమ్ము దయా శభాయి పంపినాడుగాన మీకేదోవ్యవస్థ యొనర్చుట నాకు విధియై యున్నది. సరియే, మీరిప్పుడిటుల నొనర్పుడు.

మీరిప్పట్టున నరుగుడు— రేపు నన్ను గలసికొనుడు—"

"చిత్తము. ఈ బీదవానియందు దయయుంచుడు" అని మరల నొకమారు రావుసాహేబుగారికి సవినయముగ నమస్కరించి నేను మహదానందమున నెలవున కరిగితిని. రావుసాహేబుయొక్క యీకరుణారసపూరిత వాక్కులవలన నాకట చేతిస్వర్గము కానవచ్చినది. నామనసునం దాతని కనేకవిధముల ధన్యవాదము లొనర్చుచు, మరియు బరమేశ్వరుని సంస్తుతింపుచు నేను ప్రసన్నహృదయముతో గృహమున కరిగితిని. దయాళసేట్జీ కూడ నా ప్రఫుల్లవదనమును, నేను వచించిన సంతోషపూరిత వాక్యములును నాలకించి నాకు నిస్సందేహముగ నుద్యోగము లభించెనని వక్కాణించెను. మరి యింక గావలసినదేమి! ఎప్పు డీరేయి గడచు నెప్పుడు తెల్లవారు మరియు రావుసాహేబు నెప్పుడు మరల గలసికొందునని నేనాతురమందుచుంటిని. ఎటులనో నాదినము గడచి పోయెను. ప్రభాతమయ్యెను. నేను మిక్కిలి యాశతో ట్రాం బండి నధిరోహించి రావుసాహేబుగారి బంగాళాయందు హాజరైతి. నన్ను గాంచుటతోడనే రావుసాహేబుగారు నగుచు నిట్లనిరి "మరల నిచటి కరుదెంచితి వేటికి? ఉద్యోగమేమైన నాయింటియం దున్నదా యేమి? రేపు నన్నాఫీసులో గలిసికొనుము:"

ఇక్కడికొక్క దివసము నిరర్థకముగ గడచిపోయెను. అయి ... నాకంత చింతగలుగలేదు. కారణ మాశయే!

మఱుచటిదినమున నేను పదిగంటలగునప్పటికి రావుసాహేబు గారి యాఫీసునందు హాజరైతిని. రావుసాహేబుగారు పదు నొకండు పదునొకండుగంటలన్నర సుమారున కాఫీసునకు వచ్చిరి. ఆఫీసుయొక్క ముఖద్వారముచెంతనే డలాయత్ బంట్రోతులతోపాటు నేనును నిలబడియుంటిని. నన్నుజూచుట తోడనే రావుసాహేబు కొంచెము విసువుజెందినవాని చంద మున గన్పట్టి యిట్లనియె "నీ యర్జీయేది?"

ఇంటనుండి నేనేమియు నర్జీమొదలగునవి తెచ్చియుండ నైతిని. మరియు రావుసాహేబుగా రర్జీవ్రాసి తీసికొని రావల యునను విషయమేమియు నాతో జెప్పియుండరైరి. అటుల గుట "నేనర్జీవ్రాసి తెచ్చియుండనైతి"నని వచింపవలసివచ్చెను.

"మరి యిటకెందులకు వచ్చితివి?" అని రావుసాహేబు మిగుల విసిగికొనియెను.

నేను మిగుల నమ్రతగ నిట్లని ప్రత్యుత్తర మొసగితిని "నేనింతవర కెన్నడును నర్జీమొదలగునవి వ్రాసియుండనైతిని. అందువలన నాయందు దయయుంచి యది యెటులవ్రాయ వలయునో నానతీయ మిమ్ము వేడుకొనుచుంటి" నంటిని.

నాయొక్క యీవినతి రావుసాహేబుగారి కాగ్రహము కలిగించకాబోలు! ఆత డాఫీసులోని కేగుచునేగుచు గఠోర వాక్యముల నిట్లనియె "ఇంతమాత్ర మర్జీవ్రాయుటయే చేత కానియెడల నింకమరి నౌకరీనెటుల జేయగలవు? దయాళనేటు నిన్ను నాకడ కంపుటెందులకు? నీవిపుడరుగుము. రేపర్జీ తీసి

కొనిరమ్ము. మరి చూతము—”

అవుసరముగలవాని కభిమానము లేదని వచింతురు. అది యబద్ధమా! తిరిగి మఱునాడు పదిగంటలకు నే నర్జీగైకొని రావుసాహేబుగారి యాఫీసున కరిగితిని. రావుసాహే బర్జీగైకొని చదివిచూచి “మంచిది నీ వెల్లుండి రమ్ము” అని నా కాజ్ఞాపించెను.

ఎంతో కష్టమున నే నీదివసద్వయము గడపితిని. మరల నియమితకాలమున కాఫీసున హాజరైతిని. రావుసాహేబు తిరిగి “బుధవారము రమ్ము”ని యానతిచ్చెను.

బుధవారమరిగితిని. మరల “సోమవారము రమ్ము”ని హుకుమయ్యెను. మరి సోమవార మరుగ మరల “శుక్రవారము రమ్ము”ని యాజ్ఞ. ఇటు లొక్కటేవిధమున వాయిదాలపై వాయిదాలు పడుచుండెను. ఇటుల వృథాకాలయాపనతో దాదా పొక్కమాసము దినములు గడచిపోయెను. ఆఫీసున కత్యాశతో జనుటయు నింటికి హతాశుడనై తిరిగివచ్చుటయు ననుదినము తటస్థించుచుండెను. నన్నిటుల నిష్కారణముగ ద్రిప్పుటకును, మరినా కనుదిన మాశాభంగ మొనర్చుటకును రావుసాహేబున కణుమాత్రము గూడ లజ్జ వొడముటలేదు. మరియు విసుపైనజనించుటలేదు. పాప మాతనియందు దోషమారోపింపనేటికి? నా యట్టిదీనులనుఁ నిరాశ్రితులను నిటుల ద్రిప్పలుపెట్టుటే యట్టి పెద్దమనుష్యులకు భూషణముగను,తమ యధికారమునకు గొప్పతనముగను గన్పట్టుచుండును. అయ్యో!

ఆదయామయునకు బరమాత్మునకేటికి నా మొఱవినఁబింపదో, మరియేటికి దయకల్గదో! తుద కిదియంతయు నాదురదృష్టమని భావించి రావుసాహేబుయొక్క యాతియ్యనిపల్కులకు మోసపోక, అతని యాఫీసునందలి నౌకరీయాశ వదలుకొంటిని. అప్పటికిని నా యుద్యోగాభిలాష నన్ను విడచినదికాదు. టైమ్సు, గెజట్, ఎడ్వోకేటుమొదలగు డైలీవర్తమానపత్రికలయందలి 'వాంటెడ్' అనువార్తలగాంచి యాయా తావులకు బ్రతిదినము నేనర్జీల బంపుచుంటిని. ఉత్తరములనిమిత్త మనుదినము నా కైదారణాల చీట్లు ఖర్చగుచుండెను. ఇవ్విధమున దాదాపు పదునైదుదినములు ప్రతీక్షించితిని. కాని నా దురదృష్టము. ఒక్కచోటనుండికూడ ప్రత్యుత్తరము లేదు. ఇటు లర్జీలబంపిమాత్రము నేను స్వస్థముగ నూరకుంటినా? నేనెట్లు స్వస్థముగ నూరకుండగలను? నేను వదివేలరూప్యము లార్జింపవలసియున్నది. గృహమునుండి వదిగంటలకు బయలువెడలుట సంధ్యాకాలమున ఆఫీసులు మూసివేయుపర్యంతము ప్రతియాఫీసునందు నుద్యోగశోధన మొనర్చుట, ఇవ్విధమున నా దినచర్య ప్రారంభమగుచుండెను. కాని నే నెట్టి దురదృష్టవంతుడనో! ఎక్కడను నన్ను జూచువారైన లేరైరి. ఎచట కేగిన నచట లాకు పత్త్వము తటస్థము.

ఇవ్విధమున మరియొకమాసము వ్యర్థముగ గడచిపోయెను. ఉదయముమొదలు సాయంకాలపర్యంతము భ్రమరితిని. ఆఫీసులందలి బంట్రౌతు మొదలుకొని హెడ్‌క్లర్కువరకు

నందరిని నాశ్రయించితిని. ఆఫీసరులవద్ద దీనవదనుడనై దయా భిక్షవేడితిని. కాని యీసమస్తమునకు ఫలితమేమి? ఎచట కేగినను, ఏ సమయమున నరిగినను లాకేత్వమేకదా నాకుసం ప్రాప్తము! వాచక మహాశయులారా! ఈసమయమున నా మనస్థితి యెటులుండెనో యయ్యది నాకొక్కనికే విదితము. ఒకవత్సరములో నేను దశసహస్రరూప్యము లార్జింపవలసియుం డెను. కాని యీవత్సరము గడువునం దిప్పటికప్పుడే రెండు మూడు మాసములు గడచిపోవుచున్నవి. ఇప్పటికిని నాకెచ్చ టను నేమియు దెరవుగానరాదయ్యెను. అటులగుట నాకెంతటి దుఃఖము గలుగుచుండెనో, నాదరిద్రజీవితమునందు నాకెంతటి యసహ్యత బొడముచుండెనో యద్దానిని వర్ణింపజాలను.

అటులయ్యును నీ ప్రపంచమున నాశయనునది యొకమహా ద్భుతశక్తిగలదై యున్నది. మరియు మనుష్యమాత్రులయందీ యాశ స్వభావజనితమై యున్నది. అందువలన నీ జగత్తున కీ ప్రస్తుత సుఖమయస్థితి సంప్రాప్తమైయున్నది. ప్లేగువంటి ప్రాణా పాయకరమగు భయంకరరోగ మొకనికి సంప్రాప్తమై రోగి జీవించులక్షణము లణుమాత్రము గూడ గానరాకున్నను నా తనిబంధుగులు రోగిని బ్రతికించుటకై యనేకప్రయత్నము లొనర్చుచుందురు. కారణమేమి? ఒకవేళనారోగి యట్టి మహా విపత్తునుండి గూడ రక్షింప బడునేమోయను నాశయేకదా? మరియు నప్పుడప్పు డియ్యది సఫలమగుటగూడ మనకనుభవ మేయైయున్నది. మనుష్యుడెంతటి సంకటమునైనజిక్కనిండు.

ఈ కష్టదినములు గడచిపోయి తానుమరల మంచిదినములు చూడగలనను నాశయే వానికి గలుగనియెడల నత్యంత దుఃఖమునను, విపత్తునను మునిగియున్న మనుజునివలన నిజోన్నతికై యేమాత్రమైన బ్రయత్నము సలుపబడునా? ఎల్లెడల మిక్కిలి నూన్యముగ గన్పట్టుచున్నను మనుష్యున కాశ తనమోహాకస్వరూపమును గోచరింపచేయుటవలననే వానివలన ననేకసమయముల యందనేక సాహసకార్యములు నిర్వర్తింపబడి యథాకాలమున నందు యశస్విగూడనై తనమనోరథసిద్ధి గాంచుచుండును. మరియు నందువలననే నేజెప్పుచుంటిని. జగత్తునందాశ యొక మహాద్భుతశక్తిగలదై యున్నది. నాకునునీయాశయే నిత్యమును తనమోహాకస్వరూపమును గనబఱచుచుండవలెను. నిజము.

నాకు భాగ్యకాల మీా దినము వచ్చును. రేపువచ్చును మాపు వచ్చును. పదిమదినములలో రావచ్చును. తప్పక మాసముదినములలోనైన వచ్చితీరునని నామనోదేవత నాకు మాటిమాటికి జెప్పుచుండెను. కాని ప్రత్యక్షానుభవము మాత్రము మిక్కిలి వ్యతిరేకముగ నుండెను—ఇంతియేకాదు. క్రమక్రమముగ నాధైర్యము సడలిపోయి నేమిగుల హాతాశనగుచుంటిని. అటులయ్యు నాశయేమియు సమూలముగ నాశనమగుటలేదే! ఇకముందేమి యొనర్పవలెనను నీహ్యాద్వేగ మొక్క టేవిధముగ నాయంతఃకరణమును దహించివేయుచుండెను. నాకు వేఱుగతి యేమికలదు? భక్తకోటిని సంకట

విముక్తులజేయుటకు నీశ్వరు డెట్లో యట్లీ ప్రతీశ్వరస్థానమును గైకొనియున్న దయాళసేటుజీయందే నాయావద్భక్తిభావము నిలచియున్నది. నాయీయాయల్పజీవన క్రమమునం దిదివరకు కారణపరత్వమున ననేకులతో ప్రత్యక్షాప్రత్యక్షరీతుల నాకు బరిచయము కలిగియుండెను. కాని మాదయాళసేట్జీవంటి దయామయుడును, పరోపకారియు మరియు దుఃఖితవిషయముల యథార్థమగు పరితాపమంది శక్త్యానుసారముగ నితరులకు దరుణోపాయ మొనర్చుటకై ప్రయత్నించు విభూతియుగల మనుజు డింతవరకు నాకొక్కడును గానరాలేదు. తుదకు నే నాతని పాదములబట్టి కొనుటకే స్థిరపరచి కొంటిని. ఈ సంకటమునుండి నన్నాతడే యుద్ధరింపవలయును. అని తలపోసి సాశ్రునయనుడనై యాతనిబ్రార్థన మొనర్చితిని. నేను దీనస్వరమున నిటులంటిని "సేట్జీ! మీరు నా కెట్టినౌకరీనైన జూపింపుడు. అద్దాని నొనర్చుటకు నేను సంసిద్ధుడనై యుంటిని. నా సమస్తవృత్తాంతమును మీకు దెలిసియే యున్నది. ఒక్కొక్కదినమే యివ్విధమున నిరర్థకముగ జనుట జూడ నాయాయుష్యము నందొక్కొకవత్సరమే పోవుచున్నటుల నాకు దోచుచున్నది. ఎంతటి త్రాసదాయకమైనను సరియే ఎంత యెక్కువకాలము—ఎంతటి శ్రమదాయకమగు నుద్యోగమైన సరియే, మానాభిమానముల గూడ నేను పాటింపను. ఎట్టిదైనను సరియే నా కొక నౌకరీ జూపింపుడు. తుద కొకానొక కూలివానిపని యొనర్చుటకు సైతము నా కెట్టి యభ్యం

తరమును లేదు. నా కేదే నొక తెలివు జూపింపుడు. పనియెం తట్టి నీచమైనను సరియే, ఎంతటియసహ్యకరమైన దైనను సరియే యద్దాని నొనర్చుటకు నే వెనుదీయను. నా కేదో వ్యవస్థ నొనర్పుడు—"

ఆ సమయమున నా యొక్క యీకరుణాయుక్త, ఆవేశ యుత దీనాలాపము లాలించినంత దయాళుసేట్జీ కోమలహృదయము ద్రవీభూతమయ్యెను. ఆతడు గద్గదస్వరమున నిట్లని యెను "గంగాధరా! ఈ కార్యము నా చేతిలోనిదే యైయుండి నచో నే నద్దానిని క్షణమాత్రమైన విలంబన మొనర్పక నొనర్చి యుందును. కాని యేమిచేయను? ఇప్పటి యీ కటువు దినములబట్టి యాలోచింప నా కేమియు నుపాయము దోచుటలేదు. వృధగా నొకని కాళ్లగొల్పి, పాపము వానిని నమ్మించి తుట్టతుదకు హతాశునిగ జేయుట నాకంత ప్రశస్తముగ గన్పట్టదు. తనసామర్థ్య మెఱింగి యొకనికి వాగ్దత్త మొనర్పవలయును. ఆలోచింపగా పాపము నిరాధారుడైన యేతరుణు డుద్యోగమువలనగాక చరితార్థుడగుటకు వేఱు సాధనమేమియులేదో యట్టివాని కది స్పష్టీకరించుట ముఖ్య కర్తవ్యము. స్పష్టముగ నా వలనగాదని వచించుటవలన వారా తని యుద్యోగవిషయమున నెంతటి హితమొనర్చిన వారగు దురో యంతకన్న నెక్కుడుగ, తమకట్టి సామర్థ్యము లేక పోవుటవలననేమి, మరియు దమకుశక్యమయ్యును నిచ్ఛలేక పోవుటవలననేమి, మరియు నేయితరకారణముల వలననైన

నేమి, వానికి నౌకరీ సంపాదించి యిచ్చుట దమవలన గాదని బాగుగ దెలసియుండియు నొకని నూరక నమృతోపమాన వాక్యములచే నాశగొల్పి, నమ్మించి మోసగించుట పాప మాతని నాశనమునకు గారణమగును. ఇట్టి ప్రవర్తనముగలవా డాతనికి శత్రువనియే జెప్పనొప్పును. నీ విప్పు డేయుద్యోగముయొక్క కష్టసుఖములు మరియు మానాభిమానములు మొదలగు విషయముల నాకడ వాక్రుచ్చితివో వాని సరియగు ననుభవ మంతవరకు నణుమాత్రముగూడ నీకు లేదని తలంచెదను. గంగాధరా! నౌకరీ, మరి యది యొకానొక సామాన్య సేవకుడు గానిమ్ము. మరియు నాలుగైదువేల రూప్యముల వేతన మనుభవించు ఆఫీసరు గానిమ్ము. ఆతని వెనువెంటనే త్రాసము, మానహాని, అన్యాయము నిత్యాదిమనుష్యసామాన్యమున కప్రియములగు నిట్టి యనేక విషయము లాతని వెనువెంట చ్ఛాయవలె నంటియే యుండును. ఇప్పట్టున గొందఱు కాత్రాసము మానహానిగ దోచుటలేదు. అందే సౌఖ్యము, సన్మానము గలదని భావించి వారు తృప్తులగుచుందురు. అది వట్టి వెఱ్ఱితనము. శక్యమగునంతవరకుద్యోగము వాంఛించుట యవిచారణీయమని నా పూర్ణాభిప్రాయము. అనగా నెల్లరు నుద్యోగము విడిచిపుచ్చవలయునని నే వచించుటలేదు. సాధ్యమగు నంతవరకు స్వతంత్రరీతినే జరితార్థుడగుటకు సాధన మరయు ప్రతివాడును బ్రయత్నింపవలయునని నా స్వకీయ ప్రామాణిక మతమై యున్నది. ఉద్యోగము లభ్యముకానిచో నేను కూలి

వానివంటి నీచవృత్తిని సైతము నొనర్తునని నీ వేదో వాక్సందర్భమున ననియుంటివి. కాని నేను నిన్నిట్టుల ప్రశ్నించుచుంటిని. కూలివానికన్న నుద్యోగీయునకు నీ వేవిషయమున శ్రేష్ఠత్వ మాపాదింపగలవు? నేనుమాత్ర మిటుల దలంతును. ఉద్యోగము అనగా గులాంగిరీకన్న చెమ టూడ్చి శ్రమపడి పొట్టబోసికొను కూలివానిజీవితమే వేయిరెట్లు శ్రేష్ఠముగదా! టేబిల్ ముందర గుర్చీలపై నీటుగ గూర్చొనియెడి యుద్యోగీయులకన్న వర్షాతపముల శరీరమున జెమ్మటలు గ్రమ్మ బనిచేయు కూలీల శారీరక శ్రమము కించదధికమై యుండును. అటులయ్యు వా రెంతటి స్వాతంత్ర్యము, వారి మనసున కెంతటి సౌఖ్యము కలుగుచున్నవో యంతటి సౌఖ్యము వంగివంగి సలాములు సేయుచు పై యధికారులవలన నాన్సెన్సు, గాడిదె మొదలగు నిందావాక్యప్రహారములకు దలయొగ్గు గుమాస్తా మొదలగు నుద్యోగుల కణుమాత్రమును లేదు. రైలుబండ్లయందు సామాను లెక్కించుట, స్టీమర్లలోని సామగ్రుల దింపుట యెక్కించుట మొదలగు కార్యము లొనర్చు కూలీల రాబడి తెలిసియుండిన నీ వాశ్చర్య మొందుదువు. బందరు (బొంబాయియందు స్టీమర్లలో నెగుమతిచేయు సరకుల నిలువచేయు రేవుస్థలము) నకు నీ వొకమారరిగి చూచిన యెడల నచటి పనివాండ్ర కష్టమును రాబడియు నెటులుండునో నీకు తెలియగలదు. నీవు కూలివాండ్ర విషయ మెత్తితివి గాన నీ విషయము నాకు జ్ఞప్తికి వచ్చినది.

నాకరీకోఱకు నీ వింతటి యట్టహాసము సేయుటకన్న నేడే
కొక కంపెనీకూలీ యేజంటుచేతిక్రింద బనిచేసినట్లైన నీకు
చాలా లాభము కలుగగలదని నాకు దోచుచున్నది. మరియు
ని యదృష్టము బాగుగ నున్నయడల కొలది దినము
ులో నీవు చాల ద్రవ్యము నార్జింపగలవు. ఒక స్టీమర్ కంపెనీ
యేజంటుకును నాకును సాధారణ పరిచయము కలదు.
ని కిష్టమైనచో రేపు ని న్నాతనియొద్దకు గొంపోయెదను''

నేను క్రిందిగడపలమీాద గూర్చునియుంటిని. ఆమాట
లాడుచున్నది దయాళసేటుజీగాక ప్రత్యక్షముగ నాకాశవాణి
యే యిట్లు బల్కుచున్నటుల నా కర్ణములకువినవచ్చి చప్పున
లేచి దయాళసేట్జీ పాదద్వయమును బట్టికొని యిట్లంటిని
"మీారే నాకు దల్లియు దండ్రియునై యుండిరి. నేనుమీాబిడ్డను.
బందరునందు స్టీమరుకంపెనీయొక్క సరకుల సంబంధ
మగు కూలీపని చేయుటకు నేను సర్వసిద్ధముగ నుంటిని.
ఆ యేజంటువద్దకు నన్ను రేపే తీసికొనిపొండు."

నాయీా నిర్ధారణవాక్యము లాలించి దయాళసేట్జీ చకితు
డైపోయెను. మరియు నా మొగమువంక దదేకదృష్టిని చూడ
సాగెను. అనంతర మాత డిటు లనియెను. "గంగాధరా! నీ-
విప్పు డిటులనుచుంటివి సత్యమేకాని నాకు భయమగుచున్నది.
నీయీా నిర్ధారణ చాలాకాలము నిలుపబోదు. నీ వొక్క
దినములోపలనే దీనినుండి పరాఙ్ముఖుడ వయ్యెదవని నా
నమ్మకము."

కాని నేను మిగుల బతిమాలుటవలన దుట్టతుద కాతడు నావిన్నప మంగీకరించెను. మఱుదినముననే నన్నాతడు స్టీమరు కంపెనీయేజంటునొద్దకు గొంపోయెను. అచటికేగినంత దయాళ సేట్జీ నావిషయమై యేజంటుతో జెప్పి యాదినమే నాపేరు కూలీవాండ్రలిస్టులో జేర్పించెను. ముందు రాబోవు విధమున నాయొక్క యీ నవీనోద్యోగము ప్రారంభమయ్యెను.

వాచక మహాశయులారా! ఒక వత్సరములోపల దశ సహస్రరూప్యము లార్జింపవలయునను వెర్రినిబడి నేను స్వీకార మొనర్చినయీవిచిత్రోద్యోగమునుగాంచినమీకుగూడమిగుల నాశ్చర్యము గలుగవచ్చును. కార్యాకరణమునందును వేష భాషలందును పాప మెవ్వ రజ్ఞానులై యుండిరో అశిక్షితులై యుండిరో యట్టి కూలీజనులు నాయాకృతివిషయమున నేమని భావింతురో యయ్యది మీరే యూహింపుడు. బందరునందలి కూలివాండ్రందరిలోను నొకటే గంద్రగోళము బయలుదేరెను. మరియు గంగాధర్, గంగాధర్ అనుపేరు మిగుల నల్పావకాశ మున నే వారివారినోట సుస్థిరమయ్యెను. నావంటి పసిమిచా యయు, సుకుమార ప్రకృతియుగల మనుజుడు వచ్చి వారిలో గలియుటవలన వా రచ్చెరువందసాగిరి. ఇంకను నాకుగలదారి ద్ర్యస్థితి తెలియుటతోడనే వారునాపట్టునమత్సరమూనకమీదు మిక్కిలినాయెడ గరుణార్ద్రహృదయులైరి. మరియునాపట్టున వారి కొక విధమగు సాభిమాన కౌతుకముకూడ యంకురిత మయ్యెను. అల్పావకాశముననే నెల్లరు నన్ను క్షేమదృష్టుల

వీక్షింపసాగిరి. ఇంతియేకాదునాయొక్క ప్రతికార్యమునందును నాకు మనస్ఫూర్తిగ సహాయమొనర్చుచుండిరి. పదునైదు దినములలో యాకూలివాండ్రకెల్లరకును నేను ప్రియస్నేహితుడనై పోతిని. అందరకు బ్రతికార్యమునందును గంగాధరుని సలహా యవసర మాయెను. గంగాధరు డాకూలిజనులకెల్లరకు నొకచిన్న నాయకుడయ్యెను.

నాలుగైదుదినములు యనుభవమువలన నాస్థలమున జేయు బనిపాటలయొక్క యాణుపాణులన్నియు నాకుదెలిసిపోయెను. ఎవ్వడెంతటి శ్రమమొనర్చునో యంత ఫలితము లభించుచుండును. మరియు నేనుమాత్రము శ్రమకొనర్చువిషయమున యత్కించెత్తుకూడ నొడలుదాచుకొనువాడనుకాను. మనుజునకెంతవరకు సాధ్యమో యంతవరకు సర్వము నొనర్చుటకు నేనొంటికాలుమీద తయారుగనుంటిని. కారణమేమన, నొక్క వర్షములోపల నేను పదివేలరూకల నార్జింపవలసి యున్నది. మరియునిచ్చటనో శ్రమకుతగినఫలితమే లభ్యమగుచుండెను. అటులగుట రక్తము నీరగునటుల సంతోషముగను, లక్ష్యపూర్వకముగను నేను కార్యములజక్కపెట్టసాగితిని. మరియుప్రస్తుత మచ్చట నెల్లప్పుడు పనిచేయుకూలీలను నేను మించిపోతిని. దానిననుసరించి నా రాబడికూడ నధికముకాసాగెను. ఇందుల కెవ్వరును వింతపడరు.

పరమేశ్వరుడు నన్నీయగ్రకులమున నేలబుట్టించెను? అంతకన్న పాప మీాయమాయకులును, సాధువులును, వినమ్రులును, ప్రేమ రసార్ద్రహృదయులును, మరియు నితరులకొఱకు బ్రాణముల నైన దృణముగనెంచి యర్పింప సంసిద్ధులగు నీయల్పకులజుల యందు నే జన్మింపనైతినగదాయని యిప్పట్టున దలపోయసాగి తిని. బ్రాహ్మణాది యుచ్చవర్ణములవారి యహంభావత్వము ను, తమయత్యల్పస్వార్థముకొఱకితరుల మహాసుఖమునుగూడ విధ్వంసమొనర్చు రాక్షసబుద్ధియు నిత్యాదిదుష్ట దుర్గుణముల ప్రత్యక్షానుభవము నాకు గలిగియుండుటచే వారియందు నాకెట్టి తిరస్కారభావ ముత్పన్నమై యుండెనో యంతకనేకరెట్లెక్కు డుగ నీకూలివాండ్రగు నల్పజనుల విషయమున నాకు మిగుల యాదరభావ ముత్పన్నమయ్యెను. అయ్యది నే నిప్పట్టున నా ప్రవర్తనాదికముల మూలమున గూడ విస్పష్ట మొనర్పసాగితిని. ఇటు లగుట నల్పావకాశమున నే వారికి నాయందింతటి ప్రేమజనించెను. 'గంగాధర్ తాత్యా!' యిది సర్వత్ర వారిగృహములయం దీయొక్కని ప్రశంసయే వినరానయ్యెను. నాకిప్పుడు మామా, బాబా, అన్నా మొదలగు నాప్తవర్గముయొక్క స్మరణకూడ దలంపునకు రా జాలదయ్యెను. ఎందరినో మామలను, ఎందరినో బాబాలను, ఎందరనో దాదాలను భగవంతు డిప్పుడు నా కొసగియుండెను.

మరియు నదికూడ నామమాత్రమునకు మామా, దాదా
బాబాకాదు. రక్తసంబంధులగువారికన్న కూడ నెక్కుడుగ
ప్రేమించి, మరియు నాకళ్యాణముకొరకు జీవములనైన నర్పింప
సిద్ధముగ నుండిరి. వారి నిష్కల్మష హృదయములు, అకృ
త్రిమప్రేమమును, మరియు నిర్మత్సరోదారబుద్ధియు నివిగాంచి
నేనుగూడ వారిలో నింతగ గలసిమెలసిపోతిని. వీరు నీచకుల
జులు నే నుచ్చకులజుడను ననుదుర్భావమునా కెన్నడును గలుగ
లేదు. వారిప్రేమలతా సౌజన్య స్వభావము, వారి యుదార
హృదయము, ప్రామాణికప్రవర్తనము వీనిముందు నాయుచ్చ
కులోత్పత్తియొక్క, విద్యయొక్క, బుద్ధిమత్తతయొక్క,
కార్యదక్షతయొక్క గర్వము సర్వము నెచ్చటి దచ్చట పటా
పంచలైపోయినది. నాకు గల విద్వత్తు, బుద్ధివైభవము నేను
వారిముందెన్నడును ప్రదర్శనమొనర్చి యుండనైతిని. వారి
కన్న నేనొక శ్రేష్టతరవ్యక్తినని వారికెప్పుడును స్ఫురణమైన
గలుగనీయలేదు. నేనుగూడ వారివంటివాడనేయనియు, వారి
పంక్తికర్హుడననియు మనమున దలంచి యటులే ప్రత్యక్షముగ
ప్రతికార్యమును నాచరింపసాగితిని. ఇతరతాత్యాలవలె గంగా
ధరు డతిగర్విష్టుడును, మరియు నితరుల దిరస్కార మొనర్చు
వాడును గాక యత్యంతనిగర్వియు, సాధుశీలుడునునగుమనుజు
డని వారివారికి మాటిమాటికి ప్రత్యక్షానుభవమునకు వచ్చు
చుండుటవలన వారునన్నధికాధికముగ ప్రేమింపుచుండిరి. వారు
తమతమ కార్యక్రమనిరూపణ, ఫిర్యాదిదర్యాప్తుల విచా

రించుట, లెక్కలు మొదలగు విషయములజక్కపెట్టుట మొదలగు నిట్టిమహత్కార్యభారమునాపై నిడిరి. వారియాయాకార్యముల జక్కబెట్టుటయందు నేను నిష్పక్షపాతముగ వర్తించుట వలననుఁ వారి లెక్కలు వ్యత్యాసములేకుండ సరిచేయుటవలనను వారికి నాబుద్ధివైభవవిషయమున మిగుల నభిమానము కలుగసాగెను. మరియు నేబడినయాశ్రమమునకు యోగ్యమగు దానికన్న నినుమడిగ నాకు బురస్కారముగూడ సంభవింపుచుండెను. స్వల్పకాలములోనే నేను వారందరికి ప్రభువునైతిని.

మానాభిమానముల భారము జుట్టజుట్టి యొకమూలబెట్టి బందరునందు నేనొకతేవిధముగ గష్టించి పనిచేయుచుంటినని పూర్వము వచించియే యుంటిని. ఆకష్టమునకు గూలి నాకు ప్రతిదినము నొకటిరెండు రూప్యములు లభించుచుండెను. తరువాత ప్రతివారము గూలీలలెక్కలుచూచుకార్యమునాపై బడినందువలన నాకు విశేషలాభము కలుగసాగెను. కొందరు రెండణాలు, కొందరు నాల్గణాలు సంతోషముగ నాకొసగుచుండిరి. అటులగుట నాకు ప్రతిదినమువచ్చురాబడిగాక యింకను మాసమునకు బదునైదిరువదిరూకలు వచ్చుచుండెను. ఇవ్విధమున నతివైభవమున నాటంకశాల ఖణఖణ మ్రోగుచుండెను.

అంతయు దైవనటనమై యున్నది. మనుజునకు దైవమనుకూలుడై యున్నచో సర్వము వాని యిచ్ఛానుసారముగ—

కాదు వారియాప్సితముకన్న విశేషముగ గూడ సంభవ
మగుచుండును. కాని దైవమే ప్రతికూలుడై యున్నచో
కావలసినదంతయు బ్రతికూలమైపోవును. ఇయ్యది ప్రపంచము
యొక్క యనుభవసిద్ధనియమమై యున్నది. ప్రస్తుతము నాకు
దైవమనుకూలుడై యుండెను. నే నెయ్యది తలపెట్టిననందు
నాకు జయము సంప్రాప్తమగుచుండెను. కూలీజనులందరికి
నాయందొకవిధమగు గౌరవాదరభావము లుత్పన్నములయ్యె
ను. నాకు మిగుల ధనప్రాప్తి కలుగుచుండెను. కాని లీలామా
నుష విగ్రహుడగు నప్పరమేశ్వరుని కింకను వినోద మొనర్ప
వలయునని యిచ్ఛవొడముటచే గాబోలు మెల్లమెల్లగ
గంట్రాక్టర్లలోగూడ నావిషయమున మిగుల జర్చజరుగుచుం
డెను. గంగాధర్ మిగుల కష్టజీవి, ప్రామాణిక ప్రవర్తనుడు,
మరియు గార్యదక్షుడుగాన వానిని జేతిక్రిందకు దీసికొన్న
యెడల మనకు రెండుడబ్బులు లాభముకలుగగలదని యిట్లు
కంట్రాక్టర్లకు నాయందు సదభిప్రాయము కలిగియున్నందున
వారంతటవారుగ నాకు చిన్నిచిన్ని పనులొసగ నారంభించిరి.
ఇదియంతయు దేవునికృపగదా యని యెంచి నేనును మహా
నందమున నా కార్యభారమును శిరమున వైచికొనసాగితిని.
నాచేతిక్రింది కూలీలుగూడ సప్రేమముగ నాకు సహాయమొన
ర్చుచుండిరి. నియమిత వేళకంటె ముందుగనే నావలన
గార్యము నిశ్శబ్దముగ సానుకూలమగుచుండుటవలన గంట్రా
క్టర్లకు గూడ నాయందధికమగు లక్ష్యమేర్పడసాగెను. మరియు

వారు సంతృప్తులై నిర్ణయముగు రొక్కముగాక స్వసంతోష మున నాకు నైదు, పది, నిరువది, యిరువదియైదు రూప్యములు పర్యంతము బహుమాన మొసంగుచుండిరి. నేను వత్సరము లోపల పదివేలరూప్యము లార్జింపవలసియుండెను. ఆద్రవ్యము నాకమితస్వార్థమైయున్నది— కాదు కాదు. అయ్యది స్వార్థదృష్టినిగాదు. యమునయొక్క ప్రాప్తికొఱనే నేనిట్లు రక్త మొడిచి ద్రవ్యసంగ్రహ మొనర్చుచుంటిని. పదివేలకొఱకు నేనింతటి విశ్వప్రయత్న మొనర్చుచుండియు దూరదృష్టిగలిగి నాపనికి సంతసమంది నడుమనడుమ నాకు కంట్రాక్టర్లొసగిన బహుమతిధనమంతయు నేనొక్కడనే యెన్నడును మ్రింగివేయ లేదు. ఆబహుమతి ద్రవ్యమునందు యోగ్యమగు నంశము నాచేతిక్రింద నాతో పనిచేయు కూలీవాండ్రకు గూడ నేనిచ్చు చుంటిని. ఎల్లరకు గొద్దిగొద్ది భాగమిచ్చినమీదగూడ నావం తున కెక్కుడురొక్కము మిగులుచుండెనని చెప్పనవసరము లేదుకద! కాని నాయొక్క యీప్రామాణిక నడవడికవలన వారెంతయు సంతృప్తులై నేనర్ధరాత్రివేళ రేకవైచినను నెల్లరు బరువెత్తుకొని వచ్చుచుండిరి. ఇవ్విధమున నొక్కటేవిధముగ నాకున్నతి కలుగసాగెను. మరియు విస్తారము ద్రవ్యముగూడ నేనంగ్రహ మొనర్చుచుంటిని.

ఇవ్విధమున దొమ్మిది మాసములు గడచెను. వత్సరపు గడువులో నిప్పుడింకను మూడుమాసములు మాత్రమే మిగిలియు న్నవి. నేను లెక్కించి చూచికొంటిని. అప్పటికి నాకడ

పండ్రెండువందల రూప్యములుండెను. మానత్రయము లోపల దక్కినరొక్కమెక్క డార్జింపగలుగుదును? అయినను నేను హతాశుడనుగాక బరమేశ్వరునిపై భారమువైచి తదేకనిష్ఠతో బనియొనర్పసాగితిని.

౧౧

బొంబాయిపట్టణమున ప్లేగతితీవ్రముగ బ్రారంభమాయెను. ప్లేగుయొక్క యీప్రారంభదశయందే ప్రజలు తల్లడమందుచు గందరగోళపడి పరువులిడసాగిరి. భీరులని శ్వేతముఖులచే గేలిసేయబడు మనహిందూజనులుమాత్రమే భయభ్రాంతులుగాక, మేము మేమని బొమ్మబాదుకొనెడి యింగ్లీషువారి గుండియలుగూడ ప్లేగుభయమున దటతటగొట్టుకొనసాగెను. బొంబాయిపట్టణమునకు నలుగడల సిపాయిలచే ముట్టడివేయబడి మార్షల్ లా ప్రారంభమై లోపలిజనములోపలనే ముఱిగి చావవలసినయోగ్యత సంప్రాప్తమయ్యెను. బయటివారి కీ దౌర్భాగ్యులగు బొంబాయిప్రజల సంపర్కముసైతము సోకగూడదని కొందరధికారుల బుద్ధికిదోచెను. మరికొందరధికారు లంతకన్న నెక్కుడుయోచనలు సేయసాగిరి. దీనియర్థ మేమన నింగ్లీషువారుకూడ నీ ప్లేగుమూలమున మిగుల భయకంపితులై పోయిరి. ఈసమయమున యూరప్, అమెరికా, ఆఫ్రికా మొదలగుదేశముల వర్తకవునరకులదీసికొని

వచ్చు పొగయోడలవా రెంతగ గజగజలాడుచు గుండె చెదరి పోవుచుండిరో వర్ణింపశక్యముదాదు. సాధారణముగ నెవ్వరు బొంబాయిరేవు ప్రవేశించుటకే సాహసింపకుండిరి. కాని యెవ్వరేని విధిలేకవచ్చుట తటస్థమైనయడల నెటులనో తొందరతొందరగ యోడలోని సరకుల గుబాలునబడవైచి, యెక్కించుకొనవలసిన సరకుల వీ లగునంతవరకు గబగబ నెక్కించుకొనియో లేని చోనటులనే ఖాళీయోడలను దీసికొనియో రేవువిడచి పారిపోవుచుండిరి. బొంబాయిగాలికూడ వారికెవరికి తగులగూడదనుస్థితిలోనికి వచ్చినది. గొప్పగొప్ప సుశిక్షితవిజ్ఞానప్రజలే యిటుల భయమున కలవెలమందుచుండ నింక మాబోటి యశిక్షిత, యవిచారణీయ, యజ్ఞానప్రజల సంగతి వచింపనేటికి? ఈప్లేగుభయమున మేమధికాధికమగు భీతచేతస్కులమైనందుకెవ్వరు నాశ్చర్యపడరు. ఇదియునుగాక కూలీలు మొదలగు మూఢజను లన్నపానీయములు లేకను, నివసింపతావు లేకను, హాస్పటులలో పారవేతురేమో యను భయముననను నివ్విధమగు కొన్ని కారణములవలన నీజనులలో ప్లేగుయొక్క మృత్యుసంఖ్య నెన్న శక్యముగానంత భయంకరముగ వృద్ధిబొందుచుండెను. దినమునకు దాదాపు వెయ్యిమంది దడదడిగ మృత్యుముఖమున బడుచుండిరి. బ్రతికిన బలుసాకేరుకు తినవచ్చునని యోచించి మిగిలిన వారు తమ కూలీపనులు మొదలగు నుద్యోగాదులకు నీళ్ళు వదలుకొని సందు జూచుకొని బయటబడి, యెవనికి దొరకిన త్రోవ

వారు పరువిడిపోయిరి. నూటికి పదిమంది కూలీలుగూడ బొంబాయియందు మిగుల లేదు.

ఇంక బొగరయోడలవారి సంగతిజూడ దా మెప్పుడు బొంబాయివదలి యీవలబడి పారిపోదుమా యన వేగిరపడుచుండిరి. మరియు నిక్కడ జూడ కూలీలు కలికమునకైన గానరాక కరవైరి. ఇటుల నిరుదెసల జిక్కు సంప్రాప్తమాటచే పాపము వారియవస్థ మిగుల శోచనీయమై జాలి గొలుపుచుండెను. వారి యలజడి వర్ణింప దరముగాదు. అప్పట్టణమున మిగిలిన మావంటి కూలీల రొట్టె నేతిలో బడ్డది. కాని యయ్యది వధ్యశిలపై నున్న రొట్టె యనుట మాత్రము నిజము. కారణమేమన భయపడి పారిపోక బట్టణమున నిలిచి యున్న వారిలో ప్రతిదినము పాతికముప్పదిమంది కూలీలు ప్లేగుకు బలియగుచుండిరి. సందేహము లేదు. కూలీ మాత్రమనేక రెట్లు పెరిగినది. రోజున కైదారు రూప్యము లిత్తుమన్నను బందరునందు చాలినంత కూలీలు దొరకుచుండుట లేదు. ఇతరులవలె నేను భయపడి పారిపోలేదని వచింప నావశ్యకము లేదు. నేను మహాధైర్య మూనితిని. ప్లేగుయొక్క భయము నాకణుమాత్రమును కలుగుటలేదు. నా కేల కలుగును? పదివేలరూకల నార్జించు పట్టున నా ప్రాణములుగూడ లెక్కగొనననని వాచక మహాశయులకు జ్ఞాపకముండియే యుండును. దశసహస్రరూప్యములు గాక నా కితర మేమియు దోచుటలేదు. మరి ప్లేగు, మహాప్లేగు వచ్చినప్పటికిని నే నణు

మాత్రమైన వానికి వెరువను. ఎప్పటివలె నేను నా పనిని వడి వడిగ నెరవేర్చుకొనుచుంటిని. ఇంతియె కాక చాలమంది కూలీలకు ధైర్యముజెప్పి, వారికి ద్రవ్యాశచూపి నేను వారిని పారిపోకుండ నిలిపియుంచితిని. ఈ దినములు మట్టుకు మిగుల భయంకరములైనవియే యైనను మిక్కిలి రాబడిగలవి.

ఈ ప్లేగుదినములలో బందరునందు కొంతమంది కూలీలను చేతిక్రిందవైచికొని యొక పొగయోడలోని సామగ్రుల నేను దిగుమతి జేయుచుంటిని. ఇంతలో నొకవర్తకపు కంపెనీ మేనేజ రచటికి వచ్చెను. ఆతనికిని మేము దిగుమతిచేయుచున్న యోడ కప్తానుకును నీక్రిందివిధమున సంభాషణజరిగెను. ఈసంభాషణ మంతయు జాలవర కింగ్లీషునందే జరుగుచుండెను. నేను పని జేసికొనుచు వారి సంభాషణ శ్రద్ధతో నాలకింపుచుంటిని. కప్తాను మేనేజరున కిటులనియె "అంత మరితప్పని సరియైనచో నే నింక నాలుగుదినములు మాత్ర ముండగలను. అయిదవ దినము సూర్యోదయ మగు లోపలనే నాయోడ యిచ్చట నుండి కదలితీరవలయు—"

మేనేజ రిటులనియె "ఈ సమయ మెంత కటువుగ నున్నదో మీకు దెలిసియే యున్నది కద! నాలుగుదినముల లోపల నింతటి సరకుల యోడలోని కెగుమతి జేయుట యసంభవముగ గన్పట్టుచున్నది. మీరు దాదా పొకవారము దినములవర కిచట నిలువవలసియుండును—"

"అటుల వలనుపడదు. ఏదో విధముగ సానుకూలము

జేసి నాల్గుదినములలో నన్ను వదలివేయవలసినదే! కొద్ది గొప్ప ద్రవ్య మధికముగ ఖర్చైనను సంశయింప నక్కఱ లేదు—"

"ద్రవ్య మెక్కుడుగ ఖర్చుపెట్టినచో పని తొందరగ సాను కూలము కాగలదని మీరు దలంచుట కేవలము భ్రాంతి. హిందూస్థానమందలి కూలీలు వట్టి సోమరులు—"

"కాని నూరుమంది కూలీలను పెట్టుచోట రెండువందల మందిని పెట్టి—కొంచెము చేయి సళ్లువిడచినయడల సమస్త కార్యములు స్వల్పకాలముననే నెఱవేరుట కెట్టి యభ్యంతరము—"

"అందునను నా కేమియు నర్థము గానవచ్చుట లేదు. మీరు వచించిన యుపాయముల రెంటివలనగూడ కార్యము త్వరితముగ జక్కపడుట లేదుకదా! మీాదు మిక్కిలి ధనము మాత్రము వ్యర్థముగ వ్యయమగును. ఇచ్చటి కూలీలకు పని లోని లోతుపాతు లంతగ దెలియవు. మరియు గాల మెంతటి మూల్యమైనదో కూడ వా రెఱుంగరు—"

"కాని మీరు ప్రయత్న మొనర్చి చూడుడు. నాలుగుదిన ములలో నే నిచ్చటనుండి వెళ్లితీరవలయును—"

మేనేజరు కొలదికాలము స్తబ్ధముగ నుండెను. తరువాత నాతడు నావంక దిరిగి హిందీతో నాతో నిట్లనియె "మాకం ట్రాక్టరును కొంచె మిటుల నొకమారు పిలిచెదవా?"

నేను మేనేజరునకు సవినయముగ సలా మొనర్చి పరుగు

పరుగున బోయి యైదునిముసములలో గంట్రాక్టరును వెతకి మేనేజరు నొద్దకు దీసికొనివచ్చితిని. కంట్రాక్టరు రాగనే మేనేజరు వానిని హిందీతో నిట్లనియె. "ఈ కప్తాన్ దొరగారిట నుండి తొందరగ నేగవలసి యున్నదట. ఈ యోడలోని సామానుల దింపివైచి దానిలో మరల నూతన సామగ్రుల నెక్కించుటకు నతిత్వరితముగ బని యొనర్చినచో సుమారెన్ని దినములు పట్టును ?"

కంట్రాక్టరు తనలో దాను కొంతతడవు యోచించి యిటు లని ప్రత్యుత్తర మిచ్చెను. "కనీసము పదునైదు దినములైన గావలయును—"

కప్తాను వైపునకు దిరిగి మేనేజ రిటు లనియె "ఈతడే మనుచున్నాడో వినుచుంటిరి కదా? పదునైదుదినములలో నెరవేర్చుటగూడ శక్యమగునో కాదోయని యాతనివాక్కుల భావము."

అందుపైని కప్తాను కంట్రాక్టరుతో నిట్లనియె (మేనేజరామాటల హిందీలోనికి మార్చి చెప్పుచుండెను) "అయితే మీకు రెట్టింపు కూలీ యిచ్చినచో నెన్నిదినములలో బని సాంతము చేయగలరు?"

కంట్రాక్టరు తిరిగి లెక్క జూచుకొనియెను. ప్రత్యుత్తర మిచ్చెను. "అటులైన బండ్రెండుదినములలో సాంతము చేయగలను."

"సరే, రెట్టింపు మజూరీ యిచ్చి పైగా నింకను నైదువం

దలరూపాయలు బహుమతి యిచ్చు నెడల?"

"అటులైన బదిదినములలో—"

"వేయి రూప్యము లిచ్చినచో?"

కంట్రాక్టరు మహానందమున నిట్లనియె "అటులైన నీదినము మొదలెనిమిదవదినమునకు బనియంతయు సాంతమగును—అంతకు లోపలమాత్రము నెరవేర్చుట కేమాత్రము సాధ్యముకాదు."

ఈపలుకు లాలించుటతోడనే కప్తానున కపరిమితమగు కోపముకలిగెను. ఆతఁడు బూటు తీసికొని కంట్రాక్టరును కొట్టబోయెను. పాపము కంట్రాక్టరు ప్రాణభీతిచే బారిపోయెను. అప్పుడు మేనేజరు కప్తాన్ దొరగారి వైపు దిరిగి యిట్లనియె "ఇప్పుడైన మీకు నమ్మకము గలిగినదా! హిందూస్థాన మందలి ప్రజలు వట్టి సోమరులు సుమా! వీరివలన నేపనియు సానుకూలము కాదు. నేనెక్కుడు ద్రవ్యము వెచ్చించుటకు సందేహించితినని మీరభిప్రాయపడినది వట్టి భ్రమయని మీకు ప్రత్యక్షానుభవము గలుగచేయుటకే నేను కంట్రాక్టరును పిలిపించి మీసమక్షమున విచారించితిని. ధనమును నేను సంతోషముగ వెచ్చించెదను. కాని ధనమువలన నా కార్యము నెరవేర—"

ఇటుల వారి పరస్పర సంభాషణము జరుగుచుండ నేను సవినయముగ నయ్యిరువురకు సలాముచేసి వారి కట్టెదుట నిలచితిని. కప్తాన్ క్రోధదృష్టుల నన్ను వీక్షించి యింగ్లీషున

నిట్లనియె "నీ కేమి కావలయును?"

నేను నింగ్లీషుతో నిట్లంటిని. "నేను నాల్గుదినములలో నీపని యంతయు సాంతము జేసెదను."

నా యీపల్కు లాలకించి కప్తాను, మేనేజరు గూడ చకితులై పోయి పరస్పరమొండొరుల మోముల వీక్షించుకొన సాగిరి. కొంత తడవునకు మేనేజరు నాతో నిట్లనియె. "నీవా కానొక సాధారణపు కూలీవి—నీ వాక్కులయందెట్లు విశ్వాసముంపగలము?"

అందులకు నే నిటులంటిని "నేను గనుక నాల్గుదినముల లోపల నీపనియంతయు నెరవేర్పని యెడల నాకు చిల్లిగవ్వ కూడ నివ్వనవసరములేదు. మరి మీకింకేమి యభ్యంతరము?"

నానోటనుండి వెలువడిన యీాకృతనిశ్చయములును, మరియు శుద్ధాంగ్లేయభాషాయుతములను నగు మదీయభాషణము లాలకించినంత దొరలకిరువురకు మిక్కిలి కౌతుకము కలిగెను. వారు ముసిముసినగవుల నొకరినొకరు చూచుకొన దొడగిరి. తరువాత నే నిటులంటిని "నేను కూలీ వారల కొక సాధారణపు మేస్త్రీనై యున్న మాట నిజమే కాని ప్రాణాంతక సమయమున గూడ నసత్య మాడువాడను గాను. కావలయు నెడల తమ రిచటి కంట్రాక్టరు లందరిని విచారింపవచ్చును. నే నేపని నెప్పటికి యొనర్తునని యొప్పుకొనెదనో యాసమయమున కంటె కొంచెము ముందుగనే నిర్వర్తించుచుందు—"

నానోట వెలువడిన యీసుస్థిరవాక్కు లాలించిన మీాద కప్తాన్ దొరగారికి మిగుల యానందము కలిగెను. ఆతడు మేనేజరుతో నిట్లనియె "మిస్టర్ మార్గన్! ఈతని మాటల యందు నాకు సంపూర్ణ విశ్వాసము కలిగినది. వీనికే మీారీ పని యొసంగుడు—"

మార్గన్ దొరగా రొక రిద్దరు కంట్రాక్టర్ల కలిసికొని నా యోగ్యతాయోగ్యత విచారించి తెలిసికొని యాయోడలో సరకుల నెగుమతి దిగుమతులు నాకు గంట్రాక్టు నిచ్చెను. కూలీల కెల్లరకు నాయందు మిగుల గౌరవము, అభిమానము గలిగియుండెను గావున రెట్టింపు మజూరీ యిత్తునని యొప్పుకొని నేను పిలచుటతోడనే మరుదినము రెండువందల మంది కూలీలు పని చేయుట కరుదెంచిరి. అంత రేయనక బవలనక బనిచేయ సాగితిమి. అచ్చముగ వారి సహాయము వలన మూడుదినముల లోపలనే యాపని యంతయు నెరవేర్చి కప్తాను దొరగారికి సలా మొనర్చితిని. ఎనిమిది దినములకుగూడ నెరవేర జాలని పని నేను కేవలము మూడుదినములలో సాంతముజేసి కెప్టెన్ దొరగారిని విడుదలజేసితిని. ఇది గాంచినంత కెప్టెన్ దొరగారికి కలిగిన యానందమింతని చెప్ప నలవికాదు. అతడు నన్నోడయందలి తన కేబిను లోనికి దీసికొనిపోయి యొక రత్నపు టుంగరమును, మరియు, వేయి రూప్యముల చెక్కును నాకుబహుమతి యొసంగెను. మార్గన్ దొరగారు కూడ నావిషయమున మిగుల సంతుష్టుడయ్యెను.

ఆతడు నిర్ణయము ప్రకారము రెట్టింపు మజూరీయును, మరియు రెండువేలరూప్యములు బహుమతియు నొసగెను. ఆ దినమునుండియు మార్గన్ దొరగారి యాఫీసునకు నేనే కంట్రాక్టరునైతిని. మార్గన్ దొరగారికి నాయెడ గలిగిన దయ కంతములేదు. అతడు తనంతట దానే గొప్ప గొప్ప కంపెనీ మేనేజర్లకును నాకును బరిచయము గలుగజేసి వారివారి పను లన్నియు నాకు గంట్రాక్టు నిచ్చున ట్లేర్పాటుజేసెను. నేనును కాలమానస్థితిగతుల విచార్చించి మామూలుకన్న రెట్టింపుగ నిచ్చిన కూలీ పైకమున్ను, నాకు బహుమతిగ వచ్చిన మూడువేల రూప్యములలోను నొక వేయి రూప్యములును నాచేతి క్రింద పనిచేసిన కూలివాండ్రకు బంచి యిచ్చితిని. ఆకారణమువలన వారు మిగుల సంతుష్టులైపోయిరి. గడవున కన్న కొంచెము ముందుగనే పని సానుకూలము జేతునని కంపెనీ మేనేజర్లకును, ఎక్కువ కూలీ యిచ్చుటయేగాక బహుమతి ద్రవ్యము గూడ బంచియిత్తునని కూలీలకును గూడ నాయెడ నమిత గౌరవము కలుగసాగెను.

ఇవ్విధమున నేనిప్పుడు మహోన్నతికి రాసాగితిని. ఈనెల నెలాపదునైదు దినములలో నాకు మిక్కిలి లాభము రాదొడగెను. తొలుదొల్త ఫక్తు నే నొక్కొక్క కంట్రాక్టు మాత్రమే చేయుచుంటిని. కానితరువాతతరువాత నొక్కమారే పది పండ్రెండుకంట్రాక్టు లొప్పుకొన బ్రారంభించితిని. నాకెన్నడును గూలీల యభావము గలుగ లేదు. నే నుత్తరములు మొద

లగునవి పంపి యితరగ్రామములకేగిన కూలీలను గూడ బిలిపించి రేయింబవళ్లు వడివడి బనియొనర్ప సాగితిని. రాత్రియందే మూడునాల్గు గంటలో మాత్రము నేను స్వస్థముగ నిద్రించుచుంటిని. తక్కిన దినమంతయు రాత్రితో గూడ కలిపి యిరువది గంటలు నేనుద్యోగమున నిమగ్నుడనై యుండెడి వాడను. మరియు బరమేశ్వరుని కృపయుండుట చేతనో యేమో తెలియదు. భగవంతుడు నాయుద్యోగాసక్తికి దగినట్టు జాలినంత కన్న నినుమడిగబని లభింపజేయుచుండెను.

ఇవ్విధమున నెడతెరపిలేకుండ గాయకష్ట మొనర్చియు గొప్పగొప్ప కంట్రాక్టులు మంచియదనున గైకొని పని నెరవేర్చియు, ఇంకను బహుమతుల సంపాదించియు బదునొకండు మాసముల పదునైదుదినములగు నప్పటికి నేను సరిగా బది వేలరూప్యములు సమకూర్చితిని. ఇప్పట్టున నాకెంతటి సంతోషము కలిగెనో యయ్యది వర్ణనమొనర్చు సామర్థ్యము నాలేఖినికి గలుగదయ్యెను! యమున నాయది—యమున నాయదియైనది—అనిపలుకుచు పిచ్చివానివలె నేను గంతులువైవసాగితిని. ఈసమయమున నేను మనంబున దయామయియగు భగీరథీబాయి కెన్నియో ధన్యవాదము లొనర్చితిని. తల్లీ, భగీరథీ! ఇప్పుడింక నీయాభరణముల విక్రయింపవలసిన యవసరమున్నదా? యమునకొఱకు కానగలనే నేను క్రయమునకుగైకొనెదను సుమా—ఇదిగో చేకొనుము పది

వేలరూకలు—అని వచించుచు నాయేకాంత గృహమధ్యమున నే నాపదివేల రూపాయలనోటును బడవైచితిని. కాని భగీరథీ బాయి యచ్చట నెక్కడ నున్నది? ఆసమయమున నావ్యక్తి నాకెంతటి దూరమున నున్నది—*

ఇప్పు డింక నాకొక్క క్షణమాత్ర విలంబనము గూడ సహనము కాదయ్యెను. ఎప్పుడు నేను చప్పున నానారావు గారికడ కరుగుదునా, ఈ పదివేలరూపాయ లాతనికిం దెప్పుడుపడవేతునా, మరియు నాయమూల్యరత్నము నెప్పుడు గైకొందునా యని యాత్రమొందసాగితిని. భోజనాదికములు నిర్వర్తించుకొని వెంటనే దయాళసేట్జీ గృహమున కరిగితిని. అతని చరణద్వయముపై మస్తకముంచి యీయానందవార్త నాతని కెఱింగించి మాగ్రామమున కరుగ నాతని సెలవు వేడితిని. నాపల్కు లాలించియు, నాసంతోషము గాంచియు దయాళసేట్జీకూడ మహానంద భరితుడయ్యెను. ఆతడు మిగుల ప్రేమంబున నన్నాశీర్వదించెను. ధనకువర్ బాయికి గూడ నీవిషయ మెఱింగించితిని. ఆమె యమునను దీసికొని రయమున బొంబాయికి రావలసినదని నన్ను మరిమరి బతిమాలెను. అందరివద్ద ప్రేమపురస్సరముగ ననుజ్ఞగైకొని నేను బయలు దేరితిని. పనిపాటలయొక్క సమస్తభారమును విశ్వాసియగు నొక సహవాసిపై నునిచితిని. వానికి సకలము దెలియజెప్పి నేనువెంటనే స్టేషనుకువచ్చి రెండుగంటలబండిలోబయనమైతిని.

ఆసమయమున నాకుగల యానందమువలన నే నెంత

యధీరుడనై తినో గాని యిప్పుడొక్క క్షణమాత్ర విలంబనము గూడ సహింపలేకుంటిని. నే నేకూలీల నడుమ నింతకాలము గడపియుంటినో వారి యనుమతి దీసికొనుటకు గూడ నాకవ కాశము దొరకలేదు. మార్గన్‌దొరవారిని దర్శించి వారిసెలవు గూడ బడయలేదు. అత్యావసరముగ నే నేగవలసిన కార్యము తటస్థమైనదని యొకచీటీమాత్రము వ్రాసి యాతనికంపితిని. ఇంతటి యాతురుడ నైపోతిని.

## ౧౨

ఈదిన మగ్నిరథ మెంత మందగతితో నడచిపోవుచు న్నది! ఈదినమే నే నతిత్వరితముగ జనవలసి యుండుటచే గాబోలు—అగ్నిశకటముగూడ తనగతి నిటుల మందముగ నొనర్చినది! ప్రతిక్షణము నాకొకయుగముగ దోచుచున్నది. మందగామియగు నయ్యగ్నిశకటము నాకీదినమెంత సంతాపము గలుగజేయుచున్నది! ఇట్టుల న న్నలయించుచున్న దానిని శిక్షించుటకు నాకడ సామర్థ్యము లేదుకదా! ఒక్కొక్కతరి లేచి నిలువబడుచుంటిని. ఒక్కొక్కసారి గూర్చునుచుంటిని. ఒక్కొక్కపరి గవాక్షములచెంత కరుగుచుంటిని. ఇటుల నిరాశుడనై శకటాంతరమున గాలుగాలిన పిల్లిచందమున దిరుగు చుంటిని. మధ్యాహ్నము రెండుగంటల బండి వాస్తవముగ

గంటలోపలనే కళ్యాణస్టేషనునకు జేరును. కాని యైదారు గంటలైనట్టున్నదె! ఇంకను కళ్యాణమురాలేదే! నాగడియారముగూడ నీదిన మెంత స్వామిద్రోహియైపోయినది. అదియు నయ్యగ్నిరథముతో నేకీభవించినది. అగ్నిశకటము చీమవలె బదములిడుచుండ నిదికూడ దాని ననుసరించి దానికన్న మందగతితో నడచుచున్నది కళ్యాణస్టేషన్కు బండిరాగనే నేను గడియారముదీసి చూడనందు రెండుగంటల యేబది నిముసములు మాత్రమే యైనదే! అంత శకటము కళ్యాణము నుండి బయలుదేరి కర్జత్ స్టేషనునకు వచ్చెను. ఇప్పటికిని శకటము తన మందగతితోడనే యథాప్రకారముగ నడచుచుండెను. కర్జత్ స్టేషనునుండి ఖండాళా, లోనావళా మొదలగు స్టేషనులు గడచి యెంతయోతడవునకు పునహాస్టేషను సమీపించెను. ఇంత పెద్దతడవు నేను శకటమునం దేరీతిని వేదన బడుచుంటినో యయ్యది పాఠకమహాశయులే యోచింపవలయును. రయమున మాపురము జేరవలయునను తలంపున నేను మిగుల నధీరుడనైపోతిని. సుఖదుఃఖాత్మకము, హర్షవిషాదాత్మకము, ఆశానిరాశాజనకము మొదలగు నానావిధ విషయములచే నాతల తిరిగిపోవుచుండెను. శిరోవేదన తీవ్రముగ బ్రారంభమయ్యెను. శరీరమున గొంచెము జ్వరము కూడ నంకురించెను. పునహాస్టేషనునందు శకటము దిగితిని. జ్వర మత్యధికమై నాయొడలు పేలిపోవుచుండెను. ఆసమయమున నామనసుకూడ నాస్వాధీనమున లేదు. చాలావరకు

నా యవస్థ యన్మత్తునిచందమున నైనది. సతారానైపున కరుగు రైలెక్కుటకు సదర్‌మరాటా రైల్వేప్లాటుఫారము మీద నేనడచుచుంటిని. ఇంతియే నాకు జ్ఞాపకము. తరువాత నేమిజరిగెనో నా కేమియు దెలియదు.—

నా జీవితమునందు మరెప్పుడును నాకు శిరోభారమువచ్చి నట్లుగూడ నాకు జ్ఞప్తిలేదు. బొంబాయిపట్టణమున నంతటి యనర్థదాయకమగు ప్లేగుదినములలో నైతము నేనటనుండిన వత్సరకాలమునం దెన్నడు నొక్కదినమైన నాకు జ్వరము రాలేదు. మరి యీ దినమున నా స్థితి యిటులెందులకైనదో? గడచినవత్సరములోపల నే నెల్లప్పుడు బగలనక రాత్రియనక, యెండనక వాననక, చలిగాలియనక నొక్కటేవిధమున గష్ట బడితిని. అటులయ్యును దానిపరిణామ మొక్కమారుకూడ నారోగ్యప్రకృతి కేమియు గలుగదయ్యెను. మరి యీ దిన మున నిటుల గలుగనేటికి? ఇంతవరకు నేబడ్డ సమస్తశ్రమము, త్రాసము, జాగరణము, చింత, ఆదుర్దా యివియన్నియు నొ క్కటిగ నేకీభవించి యిటులదటస్థము కాలేదుకద! లేకదైవము నన్నిటు లాడించవలయునని తనమనసున సంకల్పించెనేమో! అదికానిచో నా ప్రారబ్ధమే యీతీరున దాపరించెనేమో! అది యెటులైన నుండనిండు. తదనంతరవృత్తాంతమేమియు నా కణుమాత్రముగూడ జ్ఞాపకములేదు ఎప్పుడు నాకు కొంచెము స్మృతివచ్చెనో యప్పుడు నాపడకకు బ్రక్కనునిలబడియున్న యొకమనుజుని నేనిట్లు విచారించితిని "ఈదినము తారీఖెంత?"

"నవంబ రిరువదియవ తేదీ" యని యాతనినోట వెలువడి నంతనే నాగుండెలో తాయిపడెను. నేను మరల స్మృతి విహీనుడనైతిని. తదనంతరము—అటుల స్మృతివిహీనుడనై యెన్నిదినములు పడియుంటినో తరువాత చాలదినములకు నాకు విదితమయ్యెను.

తిరిగి నాకు స్మృతివచ్చుటతోడనే గనువిచ్చి చూడ నా మంచముప్రక్క పూర్వమనుజుడే నిలబడియుండెను. ఆతని చెంత నొకయూరోపియన్ స్త్రీనిలబడియుండెను. వారిరువురు మిగుల శ్రద్ధతో నాకుపచారములు సేయుచుండుట గాంచితిని. ఆమనుష్యుడు వార్డుబాయియై యుండెను. మరియు నా స్త్రీ నర్సుయై యుండెను. నేను పునహాప్లేగు హాస్పటలులో బడి యుంటినని నాతో పాటిప్పుడు వాచకమహాశయుల మనసులకు గూడ బోడగట్టియుండును. నేనుమరల నామనుజుని తారీఖెంత యని యడిగితిని. అందుకాతడు డిశంబరైదవతారీఖని బదులు చెప్పెను. ఆమాట వినుటతోడనే నాకెంతటిదుఃఖము కలిగెనో యద్దాని నెటులవర్ణింపగలను! అయ్యో! ఇంతటి భయంకర రోగమునుండి నేనేల బ్రతికితిని.? ఇంతకన్న నీప్లేగుచే హాస్పట లునందే నాకుమృతి సంభవించిన యడల నెంతయో బాగుగ నుండెడిదని భావించితిని. నా నేత్రద్వయమునుండి యశ్రువర్ష ము సంతతధారగ గురియసాగెను. నాశరీరమున నణుమాత్రము గూడ శక్తిలేదు. ఒక్కప్రక్కనుండి మరియొక ప్రక్కకొత్తిగిల నైన లేకుంటిని. అటులుండియు నేను.మాగ్రామమున కరుగ

సంసిద్ధుడనైతిని. కాని నేనెంత వేడినను డాక్టరందుల కంగీకరింపడయ్యెను. నేనింకను నొకమాసము దినములవరకు హాస్పటలునందే యుండవలసివచ్చెను. నాకు గొంచెము శక్తి వచ్చుటతోడనే నా వేడికోలుమీద డాక్టరు నేను హాస్పటలు నుండి వెడలుటకు సెలవొసంగెను. అంత నేను మాయూరి కేగ బయనమైతిని. నాకడనున్న పదివేలరూపాయల నోటును నేను రోగగ్రస్థుడనై యున్నపుడు డాక్టరుతీసి తనయొద్ద భద్రముజేసెను. అయ్యది నేను హాస్పటలునుండి బయలు దేరునప్పుడాతడు తిరిగి నాకొసంగెను.

అంత నేనొక్క మనుష్యుని వెంటనిడుకొని స్టేషనుకు వచ్చి ధూమశకట మధిరోహించితిని. రైలుమా గ్రామమునకు ముప్పది క్రోశముల దూరమున నున్నదని నేను పూర్వమేవచించి యుంటిని. బొంబాయి కేగు సమయమున నేనీముప్పది క్రోశములు కాలినడకతో వెళ్లియుంటిని. కాని యిప్పుడునడచుటకు నాశరీరమున బలములేదు. ఇదియునుగాక యెప్పు డింటికేగుదునాయని వేగిరపడుచుంటిని. అటు లగుట గుఱ్ఱపు బండియొకటి బాడుగకు మాటలాడికొని దానిమీద బయలు దేరితిని. ఈదినము మార్గశిరబహుళమావాస్య. ఇంతవరకు యమున యవివాహితయై యుండునా? ఇయ్యది నాతలంపునకు వచ్చుటతోడనే గుండెతటతట గొట్టికొనసాగెను. ఇంతలో హయశకటము గ్రామముప్రవేశించి నానారావుగారి గృహద్వారము చెంతనిలచెను. ఇప్పట్టున నాయవస్థయేమనివచిం

పను! నాసర్వాంగములు కంపింపదొడగెను. నాహృదయము మతి తీవ్రముగ గొట్టుకొనసాగెను. నామోమునుండి చెమ్మటలు స్రవింపుచుండెను. ఇప్పుడింకొక్క క్షణములోపల బరియున సానమేమో తేలుచున్నది. కాని నేనొక్క నిమిషమాత్రవిలంబనముకూడ సైపజాలకుంటినే! కేవలమాశమీదనే సమస్త భారముబైచి నేనుబండినుండి దిగితిని. కంపితచరణుడనై గృహముబ్రవేశించితిని. వసారాయరుగుమీదనే నానారావుగారి దర్శనమయ్యెను. నేనుగద్గదితకంఠుడనై పోతిని. నావద్దనున్న పదివేలరూప్యముల నోటునుదీసి యాతనిముందు బడవైచి యాతనిపదముల వ్రాలితిని.

కాని యేమీయాశ్చర్యము! నానారావుగారిపట్టుననన్ను బలుకరింపడేలనో! నేనుజబ్బుపడి మిగుల కృశదేహుడను, అశక్తుడను నైయుండి—సర్వాంగము లస్థిచర్మావశిష్టములై యుండుటచే నన్నాతడు పోల్చుకొనలేక పోయెనాయేమి? లేక నాజీవన సుఖసూర్యబింబ మస్తంగతము కాలేదుకద! నాతల తిరిగి పోవుచుండెను. నాకన్నులు చీకటులు గ్రమ్మెను. అతిశయితగ్లానివాటిల్లెను. ఆసమయమున లేచినిలచుటకు గూడ నేనుశక్తిలేని వాడనైతిని. ఇంచుకతడవునకు నానారావు నన్నులేవనెత్తి బట్టికొని లోనికి గొనిపోయెను. ఆ సమయమున నాతడు నాకు జేయూత యొసగనిచో నిజముగ నేనచ్చటనే మూర్ఛితుడనై పడిపోయియుందును. నానారావుయొక్క యీమమతాన్వితవర్తనమువలన మరల

నాకు మనసున నాశాంకురము ఉద్భవించెను. నేను కంపిత హృదయుడనై మందగమనమున గృహాంతరము జొచ్చితిని. మేడపై కరగిచూడ నచ్చట నాకు బరిచితుడును, దద్గ్రామ వాసియు నగు ప్రఖ్యాతవైద్యుడు నారాయణపంతు చింతాక్రాంతుడై యట గూర్చునియుండెను. నన్నుజూచుటతోడనే యాతడు హఠాత్తుగ చమకితుడై నావంక దదేక దృష్టిని వీక్షింపసాగెను. ఏమిచేయుటకును దోచక నేనచటి గోడ కానుకొని నిలిచియుంటిని. నారాయణపంతు నానారావుల సంభాషణవలన నిప్పుడు నాజీవనసర్వస్వము శ్రీయమున యస్వస్థస్థితియందున్నదని తెలిసికొంటిని. ఈభయంకర వృత్తాంతము చెవి సోకినంతనే నాహృత్కమలము వాడిపోయెను. నా ధైర్యము సడలి పోయెను—ఇప్పుడు నా సిగ్గుబిడియములు పటాపంచలై పోయెను. యమునయొక్క యీ యస్వస్థతస్థితి వినుటతోడనే దుఃఖభరమ్మున వికలహృదయుడనై పెద్దపెట్టున రోదన మొనర్పసాగితిని.

ఆసమయమున నా కరుణాజనకవిలాప మాలించి నానారావు వ్యథితాంతఃకరణుడై యిట్లనియె. "గంగాధరా! నీవీ పచ్చులేటే రెండునెలలకుబూర్వము వచ్చియున్నయడల యమున దశ సంప్రాప్తము కాకుండెడిది. నీ వింకను రావైతివిగదా యని చూచిచూచి తుదకు నేను యమునకు బరిణయ మొనర్చితిని—ఆకారణముననే యిప్పుడిట్టి యనర్థము సంప్రాప్తమైనది. నేనాసమయమున నెవ్వరిపలుకులు విననైతిని. ఎవ్వరిని

మన్నింపనైతిని. నే నాసమయమున నున్మాదుడనైపోయి యివ్విధమున నొనర్చితిని. దానిమూలమున నిప్పు డిటు లేడ్చుచు గూర్చుండవలసినయోగము తటస్థించినది—"

నాశిరమున వజ్రాఘాతమైనటు లయ్యెను. మరి యిప్పుడు యమున నాయదికాదా! యమున యిప్పుడు కుమారికాదా— యమున పరస్త్రీయా! ఆసమయమున నాదేహమునుండి ప్రాణపిండమును నెవ్వరో లాగివైచిరే! నిలుచోనబోయి గుబాలున నేలపై గూలబడితిని. అప్పటి నాకరుణాస్పద స్థితిగాంచి నానారా వత్యంతవ్యాకులహృదయుడై నన్ను యమునయున్న గదిలోనికి దీసికొని పోదొడగెను. కాని వైద్యుడందుకు నిషేధించెను. అప్పుడు నన్ను దివాన్‌ఖానాయందే యమున యున్న గదికివెలుపల గూర్చుండబెట్టి యాతడు లోనికరిగెను. మరియు నతడు భాగీరథీబాయికి నారాక మెల్లగ దెలియజేసెను. నేను గదివెలుపల గూర్చునియుండ నక్కడగదిలో యమున క్షీణస్వరమునపల్కు పలుకులిట్లు నాచెవిబడియెను. "వదినే! ఇప్పుడైన వారిదర్శన మొక్కమారు నాకు లభింపదయ్యెగా—నేను మరణించుటకు బూర్వ మొక్కసారిచూడ వలయునని కొండంతాశతో నుంటిని. అయ్యది సఫలము కాలేదు—"

ఎవరిదర్శనము? నాగుండె గబగబ గొట్టికొనసాగెను. ఇంతలో భగీరథి యిటుల పలుకుల వినవచ్చెను. "తల్లీ! ఏల దుఃఖించెదవు? ఈదిన మాతని దర్శనము నాకు దప్పక లభిం

మను. ఈసాయంకాలమునకు గంగాధరుడు తప్పక వచ్చి
రును—"

అహాహా! దుఃఖమధ్యమున గూడ నామనసున నెంతటి
సమాధానము కలిగినది! నే నెంతటిధన్యుడను!

యమున తరువాత యిట్లనియె "వదినే! ఇప్పుడు రారు
గదా! నీవు ప్రతిదినము నిటులే నా కాళ్ల గొల్చుచుంటివి.
నీవు నన్నెంతో ప్రేమించెడిదానవే, యొక్కమారు వారి
దర్శనము నాకు లభింపజేయవా? వదినే! నేనీదిన మింక జీవిం
పను—నిశ్చయముగ జీ వి ం ప ను—ఒక్కమారు వారిని
జూపింపుము. నా కీయొక్క కోర్కె మాత్రమే మిగిలి
యున్నది—"

ఆసమయమున యమునయొక్క యా కరుణాజనకస్థితి
గాంచ నెంతటి పాషాణహృదయమైన ద్రవీభూతము గాకుం
డునా? పాపము భాగీరథి యొక్క తెయేగాక నెల్లరి నేత్ర
ములనుండియు నశ్రుప్రవాహము ప్రవహింపసాగెను. నా
యవస్థ యెటులుండెనో యద్దానిని వర్ణింపజాలను. మిక్కిలి
ప్రయాసమున దుఃఖము లోలోన నణంచికొని భాగీరథి యిట్ల
నియెను "అమ్మా! గంగాధరుడు వచ్చియున్నాడు-వెలుపల
గూర్చునియున్నాడు—లోనికి వచ్చును—"

భాగీరథి పల్కిన యీపలుకు లాలించుటతోడనే యమున
యున్మత్తయై పోయి మిక్కిలి క్షీణస్వరమున నిట్లనియె
"వచ్చిరా—వచ్చిరా—వచ్చిరా—"

యమున నోటవెలువడిన యీ నుడువులు నాచెవి బడుచుండగనే—అప్పుడే భాగీరథీబాయి లోపలినుండి పెద్దపెట్టున రోదన మొనర్చుట వినవచ్చెను. అట్టి దుర్భరప్రసంగము వైరులకైన రాచనదు. ఆ స్థితి యెంతటి భయంకరము—ఎంతటి దుఃఖదాయకము! నేను పిచ్చివాడనై పోయి చప్పున గదిలోని కరిగితిని. వైద్యుడు నారాయణపంతు, నానారావు తొందర తొందరగ లోన ప్రవేశించిరి. చూచుచుండగనే యమున కన్నుల దేలవైచెను. వైద్యుడు తనకడ నున్నమాత్ర నొకదాని సానపై నీటితో నరగదీసి యంజనము మొదలగు నౌషధసేవలు జేసి యమునకు గొంచెము స్మృతి వచ్చునట్లు జేసెను.

కాని యిదియేమి! యమున యిప్పు డేమియు మాటలాడుటలేదు. తదేకదృష్టితో నన్ను జూచుచుండెను. అటుల వీక్షింపుచు యమున తన శుష్కనేత్రములనుండి రెండశ్రు బిందువుల విడచెను. భాగీరథీబాయి యయ్యశ్రువులదుడుచుచు దన యుష్ణాశ్రూదకముచే యమునను తడిసినైవెచెను. ఆసమయమున నానారావుస్థితి యెంతటి దయాజనకమై యున్నది! అతడు బిగ్గరగ నాక్రోశన మొనర్చుచు నిట్లనియె "భాగీరథీ! నేను నీ హితోపదేశముల బెడచెవినిబెట్టి యి ట్టియనర్థప్రసంగము దెచ్చికొంటిని. బాల్యవివాహము వలన మన దేశమునకు హాని సంభవించుటచే నేను బాల్యవివాహము నిషేధించితిని. నిజము—కాని యీ బాల్యవివాహమువలెనే ప్రౌఢవివా

హాముగూడ యవివేకినై నా యిచ్ఛానుసారమున నొనర్చితిని. ప్రౌఢవివాహమునందు వధూవరుల సమ్మతి నే నేమాత్రమును నావశ్యకమని భావింపనైతిని. నీవశిక్షితవు, నీకేమియు దెలియదని నిన్నవమానించితిని. కాని నా విద్య తగుల బడనా—నా తెలివితేటలు కాల్పనా—కన్నులు విచ్చి చూచుచు నే నీ దినము నాముద్దు చెలియలను వధించితిని—"

వైద్యుడు కూడ కన్నులు దుడిచికొనుచు "హా! సాధుశీలా! యమునా!"

నేను మూర్ఛితుడనైతిని.

* * * * *

సాధ్వి, ప్రేమమయియగు యమున చిరానందమయ స్వర్గమధ్యమున దేవరూప మందినది. మరి నేనో, నే నీపాపమయ దుఃఖపూర్ణమర్త్యలోకము నడుమ నింత దనుక గూడ నిలచియుంటిని. నాదుఃఖమయ—శోకమయ కథ చెప్పుటకును, మరియు నానారావు వంటి యేపాలకులు తమ ప్రౌఢబాలికల వైవాహికములు వారి సమ్మతిగైకొనకుండ నొనర్తురో యట్టివారి నాకార్యమునుండి పరావృతులుగ నొనర్చుటకును మాత్రమే నే నీ భూలోకమున జీవించియుండుటకు హేతువు. బాలికాబాలకులకు నే ననిశము నిటుల జెప్పుచుంటిని. "బాబులారా! కావలయు నెడ పిల్లలకు మీరు బాల్యమునందే వివాహము లొనర్పుడు. అంతియె కాని ప్రౌఢవయసునందే

బాలికలకు వివాహ మొనర్ప నెంచినచో వారితో సంప్ర దించి, వారి సమ్మతి గైకొని వారి యిష్టాయిష్టముల నరసి, వారి మనసున కేవరుడు నచ్చునో వానికే యిచ్చి వివాహ మొనర్చుడు. కన్యయొక్క యిష్టాయిష్టము లారయక బల వంతముజేసి తమ పట్టుపీడని పాలకులు తరువాత పశ్చాత్తాప మందవలసి వచ్చును.”

స మా ప్త ము